అట్ట లోపలివైపున అచ్చువేసిన శిల్పచిత్రంలో కనబడేది శుద్ధోదన మహారాజుకు గౌతమ బుద్ధుని తల్లియైన మహారాణి మాయాదేవి కన్న స్వప్నం గురించి జ్యోతిషికులు వ్యాఖ్యచేస్తూ ఉండిన దృశ్యం. వారికి దిగువ వారి వ్యాఖ్యను వ్రాసుకొంటున్న లేఖకుడు కనిపిస్తాడు. భారత దేశంలో లేఖన కళ చిత్ర శిల్పంలో నిబద్ధమై లభించే దృష్టాంతాలలో ఇదే ప్రాచీనమైనది.

నాగార్జున కొండ క్రీ.శ. 2వ శతాబ్దం.

(జాతీయ పురావస్తు ప్రదర్శనశాల, న్యూఢిల్లీ, వారి సౌజన్యముతో)

(సౌజన్యముతో)

*Devulapalli Krishna Sastri* - Monograph on the Telugu Poet by Bhoosurapalli Venkateswarlu, Sahitya Akademi. 2001. Rs. 25/-

ISBN : 81-260-0816-4



First Edition : 1996

Second Edition : 2001

**సాహిత్య అకాదెమీ**

రవీంద్ర భవన్, 35, ఫెరోజ్‌షా రోడ్, న్యూఢిల్లీ - 110 001

విక్రయ విభాగము :

'స్వాతి' మందిర్ మార్గ్, న్యూఢిల్లీ - 110 001

జీవన్‌తార భవనము, 4వ అంతస్తు, 23A/44X
డైమండ్ హార్బర్ రోడ్, కలకత్తా - 700 053

172, ముంబయి మరాఠి గ్రంథ సంగ్రహాలయ మార్గ్,
దాదర్, ముంబాయి - 400 014

సి.ఐ.టి. క్యాంపస్, టి.టి.టి.ఐ. పోస్టు
తరమణి, చెన్నై - 600 113.

సెంట్రల్ కాలేజీ క్యాంపస్,
డా. బి.ఆర్. అంబేడ్కర్ వీధి, బెంగళూరు - 560 001

వెల : రూ. 25

Printed at Liberty Enterprises, Bangalore.

# విషయ సూచిక

# నాదొక మాట

కేంద్రసాహిత్య అకాడమీవారు దేవులపల్లి కృష్ణశాస్త్రి మోనోగ్రాఫ్ తయారు చేయడానికి పూనుకోవడం ముదావహం. నాకు ఆ మహనీయుని చరిత్రను పరిచయం చేసే అవకాశం రావడం అదృష్టం.

తెలుగుభాషలో భావకవితా ప్రపంచానికి అధినేత కృష్ణశాస్త్రి. భావకవిగా పుట్టి భావకవిగా పెరిగి, భావగీతాలాలపించి, భావకవిత్వాన్ని ఉద్యమంగా స్వీకరించి విశేష ప్రచారం చేసి, రెండు దశాబ్దాల కాలం ఎదురులేని తన కవితా లహరిలో తెలుగు పాఠకులను ముంచి తేల్చి అచ్చమైన భావకవిగా గంధర్వ లోకాలకేగిన గానమూర్తి కృష్ణశాస్త్రి.

ఆధునిక సాహిత్య ప్రపంచంలోకి అడుగుపెట్టిన చాలా ప్రక్రియలు స్పృశించినా, అన్నిట్లోను స్వచ్ఛమైన భావకవిగానే జీవించారు. పద్య కవిత్వాన్ని పండించారు. పాటల కవిగా పేరు పొందారు. నాటకాలు, యక్షగానాలు చేశారు. ఎన్నో వ్యాసాలు వెలయించి వచనంలో కూడ సాహిత్య సౌరభాలు విరజిమ్మారు. అటు సంప్రదాయవాదులు ఆయన్ని కాదనలేకపోయారు. ఇటు అభ్యుదయవాదులు ఆయన్ని అభిమానించారు. ఒక్కమాటలో ఆయన పాత క్రొత్తల మేలు కలయిక.

తండ్రి నుంచి సంక్రమించిన సంగీత పరిచయంతోను, గురువుల నుంచి సంక్రమించిన సాహిత్య వాసనలతోను, ఉభయప్రధానమైన భావ కవిత్వంలోని లోతుల కోసం అన్వేషిస్తున్న రోజుల్లో కేంద్రసాహిత్య అకాడమీ వారు నాకు కృష్ణశాస్త్రిగారి జీవిత రచనకు అవకాశం కల్పించడం సమయమెరిగి చేసిన మంచి పనిగా భావించి వారికి ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను. రసహృదయాన్ని పారంపర్యంగా అందించిన తల్లిదండ్రులకు, రసలోకాన్ని చూపించి దగ్గరకు చేర్చిన గురువులకు నమస్సులర్పిస్తున్నాను.

ఈ రచనలో కృష్ణశాస్త్రిగారి జీవన సౌరభాన్ని, సాహిత్య సౌరభాన్ని సమంగా అందించడానికి ప్రయత్నించాను. సామాన్య శ్రోతకు కొద్దిగా దూరమైనా, భావకవిత్వయుగంలో బాగా చోటు చేసుకున్న కొన్ని పదాలు వాడక తప్పదుకదా ! సహృదయులు నా ప్రయత్నాన్ని ఆశీర్వదించ వలసినదిగా కోరుతూ, కేంద్రసాహిత్య అకాడమీ వారికి మరోసారి ధన్యవాదాలు తెలుపుతూ, పాఠకుల్ని కృష్ణశాస్త్రిని చూడవలసిందిగా ఆహ్వానిస్తున్నాను.

– డాక్టర్ భూసురపల్లి వేంకటేశ్వర్లు

# 1. తెలుగులో వెలుగు వచ్చింది

ఆదికవి నన్నయ్య మొదలు ఆధునిక కవుల వరకు సాగుతున్న వేయి సంవత్సరాల మహోజ్జ్వల తెలుగు సాహితీ ప్రస్థానంలో ఎన్నో మజిలీలు కనిపిస్తాయి. తూర్పు చాళుక్య ప్రభువు రాజరాజ నరేంద్రుడు తెలుగు కవికి అగ్రతాంబూలం ఇచ్చి తెలుగు కవితకు కావ్య గౌరవాన్ని రాజాస్థాన గౌరవాన్ని కల్పిస్తే, ఆయన ఆస్థానంలోని ఆదికవి నన్నయ్యభట్టారకుడు గాసట బీసట గాధలుగా సాగుతున్న తెలుగు కవిత స్థానంలో మహాకావ్యాన్ని అందునా పంచమవేదాన్ని ప్రతిష్టించాడు. శివకవులు దేశికవిత్వానికి దివ్యత్వాన్ని కల్పిస్తే తిక్కన మతాన్ని సంస్కరించి హరిహరనాథ అద్వైత సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. శ్రీనాథుడు తన శక్తికి, మానవ తత్వాన్ని మేళవించి శివభక్తితో స్వతంత్ర కావ్యనిర్మాణానికి శ్రీకారం చుట్టగా, చక్కెరలో ఘంటం అద్ది తెలుగు వాళ్ళ నాల్కలపై పద్యాన్ని నాట్యమాడించిన ఘనత పోతనకే దక్కింది. ప్రకృష్టమైన పదబంధంతో పెద్దన ప్రబంధానికి రూపమిస్తే, దేశభాషలందు తెలుగు లెస్స అనే మాటకు రూపుకట్టి ఊపునిచ్చిన మహానుభావుడు శ్రీకృష్ణదేవరాయలు. తమిళ ప్రాంతంలో తెలుగుకు రాజగౌరవాన్ని కలిగించారు నాయక రాజులు. అలతి అలతి పదాల ఆటవెలదుల్లో వేమన అధిక్షేప శతకాన్ని అందలమెక్కించాడు. యక్షగానం అక్షయంగా రూపుదిద్దుకుంది. చిత్రబంధ కవిత్వాల చిద్విలాసంతో ద్వ్యర్థి కావ్యాలు, అవధానాల వంటి అపూర్వ ప్రక్రియలు రూపుదిద్దుకున్నాయి. ఓకవైపు దేశీయ కళలు మార్గత్వాన్ని పొంది హరికథ, బుఱ్ఱకథ వంటి రచనలు కూడా తెలుగు సాహిత్యంలో భాగంగా వచ్చాయి.

ఇలా ఎన్నో తీరుల్లో ఎంతో గొప్పగా జాతి జాగృతిని ప్రతిబింబిస్తూ, తెలుగు వారి జీవన గమ్యంలో భాగంగా భాసిల్లిన తెలుగు కవితకి 18వ శతాబ్దం చివరి పాదంలో కానికాలం సంప్రాప్తమైంది. మహాసామ్రాజ్యాలు కుంచించుకు

పోయి, పాలకులకు ఏదో పద్యాల్లశిస్తు దిక్కుగా మిగిలిన దశలో, కవులను పోషించి కావ్యనిర్మాణాన్ని ప్రోత్సహించి సాహిత్యాన్ని గౌరవించగల కళా పోషకులు కరువైనారు. ప్రథమ పురుషార్థం పరమార్థంగా ప్రారంభమైన తెలుగు కవిత తృతీయ పురుషార్థంతో తృప్తిపడవలసిన రోజులొచ్చాయి. ఈ స్థితిలో కొడిగట్టిన దీపంలా-కొన ఊపిరితో మినుకు మినుకు మంటూ ఊగిసలాడుతున్న రోజుల్లో అంటే 19వ శతాబ్దం మధ్యలో కందుకూరి వీరేశలింగం ఆవిర్భవించడంతో గ్రహణముక్తమై ఊపిరి పీల్చుకుంది తెలుగు కవిత. కేవలం బాహ్యాడంబరం ప్రాతిపదికగా శబ్ద చమత్కారాలతో సింగారించుకొని అంతఃశ్శోభను మరచిపోయిన ఆంధ్ర కవిత్వంలో చోటుచేసుకున్న బలహీనతలను, రావలసిన మార్పును గమనించి అడుగేసిన మనీషి వీరేశలింగం పంతులు.

సాంఘిక దురాచార నిర్మూలనకు నడుంకట్టి మతం పేరుతో, సంప్రదాయం పేరుతో సాగిస్తున్న మారణహోమాన్ని అంతమొందించడానికి ముందుకు వచ్చిన రాజారామమోహనరాయ్ సంస్కరణ దృష్టి, విశ్వవ్యాప్తమైన నవల-నాటకం వంటి సాహిత్య ప్రక్రియలకు తెలుగులో స్థానమిచ్చి అంధకారంలో కూరుకుపోతున్న ఆంధ్ర సాహితీ సరస్వతిని పునరుద్ధరించాలనే సాహిత్య సంస్కరణ దృష్టి కలగలిసి మూర్తీభవించిన మహనీయుడు వీరేశలింగం పంతులు. ఒక్కమాటలో చెప్పాలంటే తెలుగు జాతిని జాగృతం చేసిన ప్రథమ వైతాళికుడు వీరేశలింగం. సమాజాన్ని ఛాందస దృష్టినుంచి మళ్లించి, నూతన యుగ నిర్మాణానికి ప్రోది చేస్తున్న వీరేశలింగం గారి ఉద్యమానికి ఊతగా నిలిచి ఊపునిచ్చిన వారు రఘుపతి వెంకటరత్నం నాయుడు, గురజాడ అప్పారావు పంతులు, గిడుగు రామమూర్తి పంతులు. బ్రహ్మ సమాజం వేసిన బాటలో నాయుడుగారు ముందుకొస్తే, ప్రాచీనులు గీసిన సంకుచిత వలయాలు ఛేదించి వ్యావహారిక భాషకు కావ్యగౌరవాన్ని కల్పించినవారు గిడుగు పిడుగు. రెండింటినీ సమన్వయించి సాహిత్యాన్ని నవ్యత్వ వీధుల్లో నడిపిన ఘనత గురజాడ వారిది.

వీరేశలింగం, గురజాడ, గిడుగు పిడుగు అనే వైతాళిక త్రయం చేసిన కృషికి ఫలితమే తెలుగులో నవ్య సాహిత్యం. ఏ తరం సాహిత్యంలోనైనా ఆ తరం సామాజిక స్థితిగతులు, ఆలోచనా స్వభావాలు ప్రతిబింబించాలి తప్ప వెనుక ఎన్నడో నిర్దేశించిన ఆలోచనా ప్రమాణాలు అనుసరించడం, అవే ప్రతిఫలించడం ఆమోదించదగిన విషయం కాదు. వెనుకటి సాహిత్యంలోని ఉత్తమ విలువలను

స్వీకరించి సమకాలీన ప్రమాణాలకు మార్చుకోవాలి గాని గుడ్డిగా అవే అనుసరించడం సమర్థించదగిందికాదు. కనుకనే మన వైతాళిక త్రయం విషయ స్వీకరణలోను, ప్రక్రియా ప్రయోగంలోను, భాషా విన్యాసాలలోను సంస్కరణాంతర్భూతమైన నవ్యత్వాన్ని స్వీకరించారు. సహజంగా స్వేచ్ఛ, నవ్యతా ప్రియత్వమున్న యువకులకు ఈ వైతాళిక త్రయం సాగిస్తున్న ఉద్యమం కొండంత బలాన్నిచ్చింది. దానికి తోడు బ్రిటీష్వారు ఏ దృష్టితో ఆంగ్ల భాషను మన దేశంలో ప్రవేశపెట్టినా, ఆ భాష వల్ల జాతికి కలిగే జాగృతిని గమనించి, స్వీకరించి విశ్వగమనంలోని విశేషాలు తెలుసుకో గలిగారు. ఇంగ్లీషు సాహిత్యంలోని రసోదంచిత కావ్యాలతో పరిచయం ప్రాప్తించింది. వీటన్నిటికి తోడు కాలమెలా మారినా కవిత్రయం వారి పలుకుబడులకే పట్టాభిషేకం చేయాలనే నియమం సడలి రావడంతో యువ సాహిత్యకారులు బలవంతంగా తగిలించుకుంటున్న ఉక్కు నిగళాలు వదిలించుకున్నారు. నూతనోత్తేజం రెక్కలు విదిల్చి స్వేచ్ఛగా ముందు కొచ్చింది. ఫలితంగా తెలుగుదేశంలో నవ్యకవిత్వోద్యమం ప్రారంభమయింది. అంటే సాంఘిక సంస్కరణోద్యమం, భాషా ఉద్యమం, ఆంగ్ల భాషా ప్రభావం నవ్య కవిత్వావిర్భావానికి ప్రధాన ప్రాతిపదికలు. అయితే వీటితో పాటు పత్రికావ్యాప్తి, జాతీయోద్యమం, ఆంగ్ల భాషాధ్యయనం వల్ల సంక్రమించిన శాస్త్రీయ దృక్పథంకూడా కొంతవరకు హేతువులుగా చెప్పవచ్చు.

ఈ నవ్యసాహిత్యావిర్భావంతో తెలుగులో ఖండకావ్య ప్రక్రియ చోటుచేసుకుంది. కవులు మహాకావ్యాన్ని వదలి రసవదంశమైన ఏదో ఒక ఘట్టాన్ని చెప్పడం మొదలు పెట్టారు. వస్త్వాశ్రయ కవితా రీతి కంటే ఆత్మాశ్రయ కవితారీతికి ప్రాధాన్యత పెరిగింది. మూర్తి కల్పనకు ప్రాధాన్యత తగ్గింది. తాను పొందిన అనుభూతులను స్వయంగా తానే అనుభవించి కవితాబద్ధం చేసి చూపించారు. ఎప్పుడైతే కవి స్వీయానుభూతికి ప్రాధాన్యత పెరిగిందో అప్పుడే వస్తువులో నవ్యత్వం తొంగిచూసింది. అంగాంగ వర్ణనకు అవకాశం తగ్గి ఆత్మ సౌందర్యం పట్ల ఆకాంక్ష పెరిగింది. పదబంధాలతో చేస్తున్న సాము గరిడీలకు చోటు తగ్గింది. భావ గాంభీర్యం పెరిగింది. భావనతో సౌందర్యం మిళితమై భావ సౌందర్యోపాసనలో పాఠకుడికి తన్మయత్వం సిద్ధించింది. పద ప్రయోగంలో శైలీ విన్యాసాల్లో అనుభూత్యాత్మకమైన నవ్యత్వం నడిచింది.

ఇన్ని నూతన లక్షణాలతో నడుస్తున్న నవ్యకవితావిష్కరణ వికాసాలను పరిశీలిస్తే ఈ యుగానికి గురజాడ అప్పారావు గారిని ప్రతినిధిగా చెప్పవచ్చు. నిజానికి వీరేశలింగం గారు నవ్యకవిత్వానికి ఆద్యుడైనా, సాంఘిక సంస్కరణోద్యమానికి సాహిత్యాన్ని ఆయుధంగా స్వీకరించినా, అంతకు ముందు తెలుగులో లేని నవల, నాటకం, ప్రహసనం, వ్యాసం వంటి ఎన్నో ప్రక్రియలకు స్థానాన్ని కల్పించినా ఆయన సంప్రదాయ ప్రభావంనుంచి వెలుపలికి రాలేదు. గ్రాంధిక భాషకి పూర్తిగా తిలోదకాలివ్వలేదు. సమాజ సంస్కరణకు తహతహలాడినంతగా సాహిత్య సృష్టికి పూర్తి న్యాయాన్ని చేకూర్చలేకపోయారు. ఫలితంగా ఆయన సాహిత్యంలో కళాత్మక జీవత్వం కొరవడింది. అయితే వీరేశలింగం గారి వైఫల్యాల అవగాహనతో ముందడుగు వేసిన గురజాడ సామాన్యుడికి కూడా ఆచరణలో అందుబాటులో ఉండే సజీవ వ్యావహారిక భాషని తన రచనల్లో ప్రయోగించారు. సామాజిక రుగ్మతలను ఆవిష్కరించి ఆలోచింపజేశారు తప్ప సామాజిక న్యాయాలకోసం నినాదాల రూపంగా కవిత్వాన్ని సృష్టించలేదు. అందుకే గురజాడ వారి రచనలు సంపూర్ణ కళారూపాలుగా తయారై ఇన్నేళ్లు గడచినా నిత్యనూతనంగా వెలుగుతున్నాయి.

మొత్తం మీద వీరేశలింగం పంతులు, గురజాడ గార్లతో ప్రారంభమైన నవ్య సాహిత్య రంగాన్ని ఆధునిక కవిత్వం, అభినవ కవిత్వం, భావ కవిత్వం, లిరికల్ పోయిట్రీ అనే పర్యాయ పదాలతో పిలిచారు. ఈ సాహిత్యంలో కాల్పనికవాదం ప్రధానంగా నడిచింది. ఈ కాల్పనిక వాద సాహిత్య సృష్టికి అద్యుడు రాయప్రోలు సుబ్బారావు. వర్డ్స్వర్త్, కీట్స్, షెల్లీ వంటి ఆంగ్లకవుల ప్రభావం తెలుగులోని కాల్పనిక కవిత్వం మీద ఎంతగానో కనిపిస్తుంది. నవ్య కవిత్వ సృష్టిలో కవులుగా సఫలీకృతులైన గురజాడ, రాయప్రోలు సుబ్బారావు గార్లలో ఈ భావ సాహిత్య యుగానికి ఎవరు యుగకర్త అనేది కొన్నాళ్లు తెలుగు సాహిత్య లోకంలో ప్రధాన మీమాంసగా నడిచింది. విశ్వనాథ సత్యనారాయణ, ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆంధ్ర శేషగిరిరావు, నోరి నరసింహశాస్త్రి, శ్రీ శ్రీ మొదలైనవారు గురజాడని యుగకర్తగా ప్రతిపాదిస్తే, తల్లావఝల శివశంకర శాస్త్రి, కురుగంటి సీతారామయ్య, రమాకాంతాచార్యులు వంటివారు రాయప్రోలు సుబ్బారావుగారిని యుగకర్తగా చెప్పుకున్నారు. అయితే పాకాల వేంకట రాజమన్నారు, గిడుగు సీతాపతి, డా. కొత్తపల్లి వీరభద్రరావు, డా. సి.

నారాయణరెడ్డివంటి వారు సమన్వయ ధోరణిలో ఇద్దరినీ యుగకర్తలుగా అంగీకరించారు. ఏమైనా రాత్రి ముసిరిన మంచును చీల్చుకుంటూ వచ్చిన బాలసూర్యుని తొలి వెలుగు రేఖకు కళ్ళు విప్పి కూసిన కోయిల గురజాడ అయితే, గున్నమావి చిగురులు తిని తొలిసంధ్యలో చిగురించిన మలివెచ్చని ఊసులు కలిపి తీయగా పాడిన కోయిల రాయప్రోలు. తెలుగులోని నవ్యసాహిత్యోద్యమానికి ఒకరు ప్రాణం మరొకరు ప్రణవం. గురజాడవారు భావనలో బలంతో హృదయాన్ని కదిలించడానికి, కరిగించడానికి ప్రయత్నిస్తే రాయప్రోలువారు ప్రణయతత్వాన్ని ప్రకృతి ప్రియత్వంతో మేళవించి అందమైన ఆరాధనకి పట్టం కట్టారు. ఒకరు దేశభక్తిని ప్రోత్సహిస్తే, మరొకరు గత వైభవాన్ని కళ్లకు కట్టినట్లు చూపించారు. అయితే ఇద్దరూ తెలుగు పాఠకుల చేత గానం చేయించినవారే. ఆలోచనలో ఒక్క కన్నీటిబొట్టు పెట్టించినవారే. మానవతావాదులే. సంస్కరణ ప్రియులే. ఇద్దరూ కాలాన్ని కలాన్ని బంగారు బాటలో నడిపించిన వాళ్ళే.

గురజాడ 'ముత్యాల సరాలు' సృష్టించి దేశభక్తి గీతాలాలపించారు. 'నీలగిరి పాటలు' పాడారు. సంస్కరణాంతర్భూతంగా పూర్ణమ్మ, కన్యక, లవణరాజు కల చెప్పి కన్నీరు పెట్టించారు. రాయప్రోలు యువకుల్లో భావ పరివర్తనకు కారణమౌతూ పవిత్ర ప్రణయాన్ని నింపి లలిత, అనుమతి, స్వప్నకుమారి, స్నేహలత, జడకుచ్చులు, కష్టకమల వంటి కావ్యాలు రాశారు. ఆంధ్రావళిలో ఆంధ్రజాతి ఔన్నత్యాన్ని పూర్వ వైభవాన్ని చూపించారు.

ఈ బాటలో, ఈ ప్రేరణలో, ఈ ఊపులో ముందుకొచ్చిన వారిలో అబ్బూరి రామకృష్ణారావు, పింగళి-కాటూరి కవులు, వేంకట పార్వతీశ్వర కవులు, బసవరాజు అప్పారావు, నండూరి సుబ్బారావు, దువ్వూరి రామిరెడ్డి, విశ్వనాథ సత్యనారాయణ, వేదుల సత్యనారాయణ, జాషువ, నాయని సుబ్బారావు, శివశంకరశాస్త్రి వంటి వారెందరున్నా మొత్తం భావసాహితీ స్వరూపానికి ప్రతినిధిగా నిలవగలిగిన మహాకవి దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి. ఈ విషయాన్ని చెబుతూ విశ్వనాథ సత్యనారాయణ ''నన్నయ తిక్కన మొదట యెట్లాగో, తరువాత పెద్దనగారెలాగో, భావకవిత్వానికి కృష్ణశాస్త్రి అట్లాంటివాడనవచ్చు..... ఎవ్వరేమన్నా భావ కవిత్వ మనేదానికి రూపమిచ్చి పెంపొందించినవాడు కృష్ణశాస్త్రి'' అన్నారు.

# 2. కలికి పాటల కుల స్వాములు

''తావకీన సభావన తరువితాన
శాఖికల నిత్యనూతన స్వాదుగాన
జీవసారము కురియించి చివురులెత్త
పాడుకున్నారు మా కులస్వాములెల్ల''

అని తన వంశంలో నక్షత్ర కాంతులీనిన కవి దిగ్గజాలను గూర్చి చెప్పుకున్నారు కృష్ణశాస్త్రి తన కృష్ణపక్ష కావ్యాంకితంలో.....

గోలకొండ నవాబు అనుగ్రహంతో 16వ శతాబ్దంలో ఆవిర్భవించిన పిఠాపురం సంస్థానానికి వ్యవస్థాపకుల వెంట వచ్చిన సన్నిహిత వర్గంలో దేవులపల్లి వారి వంశజాత్యులొకరు. అప్పటినుండి ఆ ఆస్థానంలోనే దేవులపల్లి విద్వత్కవులు దేదీప్యమానంగా ప్రకాశించారు. 18వ శతాబ్దంలో పిఠాపురం ప్రభువు రావు వేంకట కుమార మహీపతి రాయణింగారి ఆస్థానంలో బ్రహ్మన్న శాస్త్రిగా పిలువబడుతున్న మహాపండితుడు దేవులపల్లి బాపయ్యకవి ఉండేవారు. బ్రహ్మన్నశాస్త్రి తాను సంస్కృతంలో రాసిన 'తారావళి' అనే కావ్యాన్ని ప్రభువు కంకితం చేసి 'ఫకురుద్దీన్‌పాలెం' అగ్రహారాన్ని పొందగలిగారు. తరువాత ఈ వంశంలో ప్రఖ్యాతి పొందినవారు రామశాస్త్రి. ఈయన కాలంలో పిఠాపురాధీశులు నీలాద్రి రాయణింగారు. రామశాస్త్రి 'మాధవ విలాసం' అనే శృంగార రస 'భాణం' రచించారు. పిఠాపురం మహామంత్రి అవసరాల పద్మరాజుగారి భాగవత చంపూ కావ్యానికి 'బంధరంజని' అనే పేరుతో వ్యాఖ్యానం రాశారు. విజయనగర ప్రభువు పూసపాటి విజయరామ గజపతిని దర్శించి

పాండితీ ప్రకర్షతో మెప్పించి అగ్రహారాలు పొందారు. ఈ వంశంలో తరువాత పేరుపొందిన ప్రముఖులు సీతారామశాస్త్రి గారు గొప్ప విద్వత్కవులు.

అనంతరం రామశాస్త్రిగారి మనుమడు సీతారామశాస్త్రి కుమారుడు మరో రామశాస్త్రి కవి చక్రవర్తిగా ప్రసిద్ధి పొందారు. సాహితీ దర్పణం, రామచంద్రోదయమనే చంపూకావ్యం, బాల భాగవత వ్యాఖ్యానం ఈయన కృతులు. రామశాస్త్రిగారి తమ్ముని కుమారుడు ఈ వంశంలో మొదటి కృష్ణశాస్త్రి. ఈయన తర్కసారమనే న్యాయశాస్త్రం, సాహితీసారమనే అలంకార శాస్త్రం రచించాడు. విశ్వగుణ దర్శనం అనే ప్రాచీన గ్రంథానికి వ్యాఖ్యానం కూడా రాశారు.

ఈ కృష్ణశాస్త్రిగారి కుమారులే తమ కవితాగానంతో అవధానాలతో విశేష కీర్తి ప్రతిష్టలు పొందిన కవి చక్రవర్తులు దేవులపల్లి సోదర కవులు. వీరిలో పెద్దవారు సుబ్బరాయశాస్త్రి, చిన్నవారు వేంకట కృష్ణశాస్త్రి. వీరినే తమ్మనశాస్త్రి అనేవారు. వీరి తల్లి ఎందరో పండిత ప్రకాండులను తెలుగు సారస్వత లోకానికి అందించిన జనమంచి వారి వంగడంలోని శ్రీమతి వెంకమాంబగారు. వీరు పిఠాపుర సంస్థానాధీశులైన రావు గంగాధర రామారాయని ఆస్థాన కవులుగాను, కుమార రాజా మహీపతి సూర్యారావుగారికి గురువులుగాను ఆయా స్థానంలో మహోన్నత గౌరవ ప్రాభవాలు పొందారు. వీరిని గురించి కృష్ణశాస్త్రిగారు ''మా బాబయ్య నాన్నగారు........'' అంటూ ఏడు గీత మాలికలు రాశారు. అందులో వారి ప్రాభవాన్ని స్మరిస్తూ

''నాడు గొంతెత్తి మీరు గానమ్ము జేసి
నారు, భువనాలు తమ శ్రవణాలు విచ్చి,
'ఔ' నటంచు, 'ఓహో' యంచు నాలకింప
విస్మయాధిక సమ్మోద విభ్రమమున''

అన్నారు. అంతటి ప్రతిభా సంపన్నులు గనుకనే వారికి మహారాజు స్వయంగా సింహాసనాన్నే బహూకరించారు. ఒకరుగా జీవించిన ఈ అన్నదమ్ముల అన్యోన్యానురాగాన్ని గుర్తు చేసుకుంటూ కృష్ణశాస్త్రిగారు

''ఏనెఱుంగుదు చిరునూతనానురాగ
బంధముల కట్టువడుట స్వప్నములనేని
యెన్నడునుగాని యెచ్చోటనేని నిముస
మేని యెడబాటు సహింపలేరు.'' అన్నారు.

సుబ్బరాయశాస్త్రిగారు 'రావు వంశ ముక్తావళి' అనే గ్రంథాన్ని సంస్కృతంలో రాసి ప్రభువులు గంగాధర రామారాయణింగారికి అంకిత మీయగా ప్రతిగా ఆ మహారాజు తన సింహాసనాన్నే ధారవోసి, శాస్త్రిగారిని సింహాసనావిష్కృతులను గావించి స్వయంగా వింజామరలు వీచి సేవించారు. శాస్త్రిగారు గౌరవాన్ని చవిచూచి, పొందిన సింహాసనాన్ని మహారాజుకే తిరిగి సమర్పించి మాన్యులైనారు.

దేవులపల్లి సోదర కవులు 'శ్రీరామ పంచాశత్తు' అనే స్తుతి కావ్యాన్ని ఆశువుగా చెప్పారు. మల్హణ కావ్యాన్ని శివస్తవంగా ఆంధ్రీకరించారు. వారి 'మహేంద్ర విజయం' అనే మహాప్రబంధం గొప్పది. ఇంకా రామరాయ విలాసం, రామ పంచాశత్తు, నయనోల్లాసం మొదలైన సంస్కృతాంధ్ర గ్రంథాలు వెలయించారు. వీరి కవిత్వంలో అభౌతిక భావన ఉట్టిపడుతుంది. అసలు వీరి భావనే తరువాత మన కృష్ణశాస్త్రిగారికి ఒరవడి అనవచ్చు. ఉదాహరణకు ఒక పద్యం మనవి చేస్తాను.

''విరికిన్ మేల్వలపుల్ గుబుల్కొనిన
తీవిన్ విద్యకున్ సుప్రసి
ద్ధరహిం భాటిలు నట్లు ధీకృతికి
నీతి స్ఫూర్తి ప్రాపంచిన
ట్లురు లక్ష్మీకర లక్షణ స్ఫురణ
తో నొప్పొను, కన్యాకృశో
దరి నెమ్మేనికి జవ్వనం బొదవె
సౌందర్యైక ధుర్యంబుగన్

-నయనోల్లాసం-ప్రథమాశ్వాసం ప.110

దేవులపల్లి సోదర కవులు శతావధానం చేయడం ఒక చిత్రమైన ఘటన. ఒకసారి శతావధాన సార్వభౌములైన మాడభూషి వేంకటాచార్యులవారు రాజా

గంగాధర రామారావు గారిని దర్శించి, పిఠాపుర సంస్థానంలో అష్టావధానం చేశారు. ఆ అవధాన ప్రక్రియ తిలకించి విస్మయమొందిన రాజా ''మన సంస్థానంలో ఇలాంటి అవధానం చేయగల ప్రతిభావంతులు లేరా?'' అని ప్రశ్నించారు. రాజు ముచ్చట తీర్చటం కోసం అంతకు ముందు అవధాన ప్రక్రియా ప్రవేశం లేకుండానే మాడభూషి వేంకటాచార్యులవారి సమక్షంలోనే శతావధానం చేశారు. ఆనాటి సభలో ఆశువుగా చెప్పిన దేవులపల్లి సోదరకవుల పద్యాలు విని మాడభూషివారే గొప్పగా ప్రశంసించారు. అప్పటినుండి వీరు అనేక శతావధానాలు నిర్వహించి విజయవంతం చేశారు. వీరు కొన్నిచోట్ల శతావధానాల్లో అంతకు ముందు పరిచయం లేని భాషల్లో కూడా సమాధానాలిచ్చి సభని ఆశ్చర్యంలో ముంచెత్తారు. 1904లో జరిగిన ఒక శతావధానంలో మహాకవి గురజాడ అప్పారావు పృచ్ఛకులుగా వ్యవహరించి 'ఉద్దిష్టాక్షరి' అనే ప్రక్రియకు ప్రాతినిధ్యం వహించడం విశేషం.

''దేవులపల్లి వంశమున దేవులు పుట్టిరి'' అని చెళ్ళపిళ్ళ వేంకటకవిగారి ప్రస్తుతి గొన్న ఈ వంశంలో పుట్టినందుకు గర్వపడుతూ వారి బిడ్డగా తన జీవితం ధన్యమని చెప్పుకున్నారు కృష్ణశాస్త్రి . తండ్రుల గొప్పతనాన్ని తలచుకుంటూ శాస్త్రిగారు

''మీ పవిత్ర యశో నిర్మలాపగాతి
శీతల తరంగ జల సుధా సేచనమున,
కలుష కౌటిల్య కర్దమ మలినమైన
మీ తనయు జీవితము కూడ పూతమయ్యె !''

అని చెప్పుకున్నారు.

# 3. మధూదయంలో - మాధవుడు

విద్వత్కవుల వంశంలో పుట్టి భావకవితా హాటక పీఠమధిష్టించిన మధుమాస స్వామి దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి క్రీ.శ. 1897లో జన్మించారు. వీరి తండ్రి ఇంతవరకూ మనం చెప్పుకున్న దేవులపల్లి సోదర కవులలోని తమ్మనశాస్త్రిగా పిలవబడుతున్న వేంకటకృష్ణశాస్త్రిగారు. తల్లి సీతమ్మ గారు. ఈ దంపతులకు ఇద్దరాడపిల్లల తరువాత కృష్ణశాస్త్రి జన్మించారు. ఈయన జన్మించేనాటికి వీరి నివాసం పిఠాపురం సమీపంలో చంద్రాయపాలెంలో; ఇక్కడొక ఘటన మనం మరువరానిది. ఆంధ్ర సాహితీలోకంలో నూతన మార్గనిర్దేశకుడైన గురజాడ లేఖిని కన్యాశుల్క నాటక ప్రథమ స్వరూపాన్ని పూర్తి చేసి ఆవిష్కరించిన 1897 నవంబరు మాసంలోనే 1-11-1897 భావకవితా సుధాకరుడైన కృష్ణశాస్త్రి జన్మించడం విశేషం. ఈయన పెదతండ్రి సుబ్బరాయశాస్త్రిగారికి ఐదుగురూ ఆడపిల్లలే కావడంతో ఏడుగురక్కలకు చిన్నవాడై అల్లారుముద్దుగా పెరిగారు.

చిన్ననాడే కృష్ణశాస్త్రి కవితా రచనకుపక్రమించారు. పెదతండ్రి సుబ్బరాయశాస్త్రి, తండ్రి వేంకట కృష్ణశాస్త్రి రాజస్థాన నీరాజనాలందడానికి పిఠాపురం వెళ్లినప్పుడల్లా మన కృష్ణశాస్త్రి తోడుగా వెళ్లేవారు. పాలికాపు భుజాలమీద కూర్చొని వెళుతూనే ఆ మహాపండితుల పాండిత్యాన్ని తిలకించేవారు. ఆ పసి హృదయం తండ్రుల ప్రతిభావ్యుత్పత్తులను ఎంతగా అవలోకించేదో గాని పదో ఏటనే పద్య రచనకుపక్రమించింది. ఫలితంగా కృష్ణశాస్త్రి 'నందనందన ఇందిరానాథ వరదా....'' అనే పద్యం చెప్పారు. అప్పుడే రామతీర్థంలో కవిత చెప్పి తండ్రుల దీవెనలు పొందారు.

కృష్ణశాస్త్రిగారి బాబయ్యగారు, నాన్నగారు కూడా షష్టిపూర్తి కాకుండానే కాలధర్మం చెందారు. ఇక చేసేది లేక శాస్త్రిగారు విజయనగరంలో ఉంటున్న పెదబావగారి వద్దకు చేరి హైస్కూలు చదువు ప్రారంభించారు. బావగారి వేళాకోళానికి బదులుగా పన్నెండో ఏటనే పద్యాలు చెప్పారు.

విజయనగరంలో చదువుకున్నందుకు ఫలంగా ఆ వయస్సులోనే అభ్యుదయ కవితావైతాళికులయిన గురజాడ అప్పారావు గారిని తరచు దర్శించగలిగారు. ''యుగయుగమ్ముల నుండి మ్రోగెడు విశ్వగాన వియత్తరంగిణి .......'' గురజాడ గీతవాహినితో పొంగి ప్రవహించిందని గమనించగలిగారు. ఒకవైపు అమలిన శృంగార తత్త్వంలో రాయప్రోలు సుబ్బారావు గీతాలకు ప్రకృతి పులకిస్తుంది. మరోవైపు అబ్బూరి, వేంకట పార్వతీశ్వరుల వంటి భావ కవుల ఖండ కావ్య సుగంధ సౌరభాలతో సాహిత్య ప్రపంచం పునీతమౌతుంది. ఈ స్థితిలో స్వేచ్ఛా ప్రియుడైన కృష్ణశాస్త్రిని కాలం తనవైపుకు పిలిచింది. సంప్రదాయ వటవృక్షం రాల్చిన బీజానికి పుట్టిన మొక్క స్వేచ్ఛా పుష్పాలు పూసింది. దానికితోడు హైస్కూలులో కూచి నరసింహం, కళాశాలలో బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నంనాయుడు గార్ల ఆదరణ లభించడంతో సంఘ సంస్కరణోద్యమంలో ప్రధాన భూమిక నందుకున్నారు. హరిజనోద్ధరణ కోసం అహర్నిశలూ కృషి చేశారు.

కృష్ణశాస్త్రి 1918లో పిఠాపురం, కాకినాడల్లో విద్యాభ్యాసం పూర్తిచేశారు. పెదబావగారి కుమార్తెనే వివాహం చేసుకున్నారు. 1919లో తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి స్థాపించిన 'సాహితీ సమితి'లో సభ్యులైనారు. ఆ రోజుల్లో కృష్ణశాస్త్రిగారితో పాటు విశ్వనాథ సత్యనారాయణ, అడవి బాపిరాజు, నండూరి సుబ్బారావు, నోరి నరసింహశాస్త్రి, చింతా దీక్షితులు, కొడాలి ఆంజనేయులు, మొక్కపాటి నరసింహశాస్త్రి, మునిమాణిక్యం నరసింహారావు మొదలైన వారుండేవారు. ఈ సాహితీ సమితిని గురించి చెబుతూ కృష్ణశాస్త్రి, బి.ఏ., అనిపించుకోవడం కంటే 'సాహితీ సమితి సభ్యుడు' అనిపించుకోవడమే తనకిష్టమని చెప్పారు.

వ్యావహారిక భాషా ఉద్యమం, బ్రహ్మసమాజోద్యమం ప్రభావంతో మహోన్నత గీతాలాలపిస్తూనే కాకినాడ పెద్దాపురం హైస్కూళ్లలో ఉపాధ్యాయులుగా రెండు సంవత్సరాలు పనిచేశారు. అయితే కాలం పిలుపుతో

కల్మషాన్ని కడిగివేయడానికి రాసిన ఈయన పాటలు సంప్రదాయ వాదులకు గిట్టలేదు. అంతటి మహా కవుల కడుపున చెడబుట్టాడని తిట్టి రాజావారికి చెప్పి సంఘ బహిష్కరణ చేయించారు. తలవంచని స్వేచ్ఛా ప్రియత్వం మూర్తీభవించినవాడు కావడంతో అహంకార నిరంకుశాలు సహించలేకపోయారు. పిఠాపురం రాజావారికి వ్యతిరేకంగా 'ధర్మసాధన' అనే పత్రికలో కొన్ని వ్యాసాలు రాయడంతో రాజావారు ఆయనను ఉద్యోగం నుంచి తొలిగించడమే కాకుండా తండ్రుల కాలం నుంచి వస్తున్న 'వార్షికం' నిలుపు చేశారు. సత్యాసత్యాలు బోధ పరచి తన నిర్దోషిత్వాన్ని నిరూపించుకోవడానికయినా అవకాశం యివ్వలేదు. కోటలో ప్రవేశమే లేకుండా దేవిడీమన్నా చేయించారు. ఇలాంటి క్లిష్ట సమయంలోనే శాస్త్రిగారి భార్య మరణించింది. శోకావేశంతో 'కన్నీరు' అనే ఖండకావ్యం రాశారు. తరువాత సంఘ సంస్కరణాభిలాషి యైన గాడేపల్లి సూర్యనారాయణ గారి పెద్దమ్మాయి 'రాజహంస'ని పెళ్ళాడారు. మామగారి ప్రోత్సాహంతో సహాయ నిరాకరణోద్యమ కార్యక్రమాలకుపక్రమించిన కృష్ణశాస్త్రి ఉద్యోగం పోయినందుకు బాధపడకుండా 'నా స్కూలు మేష్టరీ ఉద్యోగం నా అదృష్టం వల్ల పోయింది.'' అన్నారు.

కృష్ణశాస్త్రి ఖండ కావ్య సౌరభాన్ని ఆఘ్రాణించి ఆనందించిన వేంకట పార్వతీశ్వర కవులు 1922లో రచించిన తమ 'ఏకాంత సేవ' కావ్యానికి శాస్త్రిగారిచేత పీఠిక రాయించారు. ఆ పీఠికలో ''నవ్యకవులకు స్వేచ్ఛ ప్రాణము. వీరు ప్రాణమైన గోల్పోవుదురుగాని శృంఖలముల ధరింపరు. వీరికి ప్రాణము కన్న గానము తీపు'' అంటూ శాస్త్రిగారు తనకు ప్రాప్తించిన విపత్తును ప్రతిక్షేపిస్తూనే నవ్యకవుల మార్గాన్ని నిర్దేశించి చూపించారు. ఒక విధంగా ఈ పీఠిక మొత్తం భావ సాహిత్య ప్రస్థానానికే ముందు మాటగా గుర్తించవచ్చు.

కృష్ణశాస్త్రిగారు తాను రచించిన ఖండ కావ్యాలు చేర్చి 1925లో 'కృష్ణపక్షము' అనే పేరుతో సాహితీ సమితి తరపున ప్రచురించారు. తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి గారి 'సింహావలోకనం' అనే పరిచయ వాక్యాలతో ఈ కావ్యం పాఠకుల ముందుకొచ్చింది. తరతరాలుగా వీరి రక్తనాళాల్లో నిబిడీకృతమైన ప్రభుభక్తితో ఈ కావ్యాన్ని సూర్యారాయ బహద్దూర్ వారికే అంకితమిచ్చారు.

దాన్ని వారు స్వీకరించలేకపోయారు. చుట్టూ కమ్మిన చీకటిని చీల్చి శాస్త్రిగారి నవ్యకవితా పథాన్ని చూడలేకపోయారు, పిఠాపురం రాజావారు.

ఆయనకు ఉద్యోగం పోవడం ఒక విధంగా ఆంధ్ర సాహిత్య లోకంలో నూతన శకారంభానికి దోహదం చేసిందంటే అతిశయోక్తికాదు. ఆ తరువాత పది సంవత్సరాల పాటు కావ్యగానం చేస్తూ ఆంధ్రదేశమంతటా తిరిగారు. కవులే కావ్యగానం చేస్తూ దేశాన్ని చుట్టిరావడం యావత్ప్రపంచ చరిత్రలో క్రొత్తబాట. శాస్త్రిగారు ఆంధ్రదేశమంతటా తిరిగారు. తన కవితలతోపాటు తోటి భావకవుల కవితలు కూడా గానం చేస్తూ భావ కవిత్వాన్ని ఉద్యమ రూపంలోకి మార్చారు. ఆ స్ఫూర్తి యువకుల హృదయాలను అమితంగా ఆకర్షించింది. పదాల కట్టులోనే కాదు పంచ కట్టులో గిరిజాల జుట్టులో కూడా.

ప్రేయసి మరణానికి దుఃఖిస్తూ కృష్ణశాస్త్రి చెప్పిన 'ప్రవాసము' 'కన్నీరు' కావ్యాలు ఆత్మాశ్రయ ధోరణిలో కవితా రచన చేసే ఆధునిక కవులకు ఆలంబనంగా నిలిచాయి. విశ్వప్రేయసిని తన వచోబంధంలో నిలిపి పాడిన 'ఊర్వశి' ప్రపంచ సారస్వతంలోనే ఆమె పేరుతో వచ్చిన అనేక ప్రేమ కావ్యాల్లో మకుటాభ్రమణిగా భాసిల్లింది. ఈ రెండు కావ్యాలు 1929లో 'జ్వాల' పత్రిక నడుపుతున్న ముద్దుకృష్ణ అచ్చు వేశారు.

శాస్త్రిగారు బ్రహ్మసమాజంలో ఉండగా రాసిన వందలకొద్ది గీతాలు 'మహతి' అనే పేరుతో సంపుటిగా వచ్చాయి. ఈ గీతాలు మంచి భక్తి గీతాలుగా కూడా చెప్పవచ్చు. ఆ రోజుల్లోనే శాంతి నికేతనాన్ని దర్శించి అక్కడి కవులతో సాంగత్యం చేశారు.

1933 నుండి కాకినాడ పి.ఆర్. కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా పది సంవత్సరాలు పనిచేసి 1942లో మద్రాసు చేరి సినిమాల్లో పాటలు రాయడం మొదలుపెట్టారు.

కొంతకాలం ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో సాహిత్య కార్యక్రమాల ప్రయోక్తగా పనిచేశారు. ఆ కాలంలోనే అనేక సాహిత్య ప్రసంగాలు, నాటికలు, రూపకాలు రాశారు. 1958లో శాస్త్రిగారి కుమార్తె సీత మసూచికి బలై పోవడంతో, చిన్నవయస్సులోనే భగవత్సాన్నిధ్యం పొందిన ఆమె స్మృతిలో శ్రీరంగనాధుని సాన్నిధ్యం చేరిన గోదాదేవి తమిళ కృతమైన 'తిరుప్పావు'ని తెలుగులోకనువదించారు.

వాటితోపాటు పల్లకి, ఋగ్వీథి, అమృతవీణ, మంగళకాహళి, ధనుర్దాసు, శర్మిష్ఠ, తిరుప్పావు, పుష్పలావికలు వందలాది వ్యాసాలు, వందలాది గేయాలు రాశారు. ఇంకా, అప్పుడు పుట్టి ఉంటే, బహుకాల దర్శనం వంటి గ్రంథాలు కూడా రచించారు. 1942లో నవ్యసాహిత్య పరిషత్ అధ్యక్షులుగా ఎన్నికైనారు. 1947లో 'మల్లీశ్వరి'కి మాటలు, పాటలు రాయడంతో చలనచిత్ర పరిశ్రమలో అడుగు పెట్టారు. దాదాపు 500పైగా పాటలు రాశారు.

1964లో ఆయన స్వరపేటికలో కాన్సర్‌వ్యాధి సోకింది. ఆపరేషన్ చేశారు గళం మూగబోయింది. ఊరూరూ తిరిగి భావగీతాలాలపించిన కలికిపాటల మధుమాస కోయిలకు గొంతు మూగబోయిందంటే ప్రకృతిలో ఎంత విచిత్రమైన లీలలు సాగుతున్నాయోగదా.

గొంతుమూగబోయినా కడవరకూ ఆయన మానసికంగా ఎంతో ఉత్సాహంగా జీవించారు. కవితా వ్యాసంగం విడువలేదు. ఆ సమయంలో రాసిన పాటలకే 'కృష్ణరజని' అని పేరు పెట్టారు. తన అభిమానులకు కొండంత సాహిత్యంతో పాటు రవంత కన్నీరు మిగిల్చి 24-2-1980 తేది గంధర్వలోకం వెళ్లిపోయారు.

''నన్ను గొంపోవరాదా నాధా
నాహృదయనాధా''

అంటూ భగవంతుని సన్నిధానం చేరుకున్నారు. కృష్ణశాస్త్రి కవిత్వం రాయడానికి కొన్ని హంగులు కావాలి. నిరంతరం సాహితీ గోష్ఠి కావాలి. మంచి సంగీతం వింటూ ఉండాలి. ఊసులు చెప్పుకోడానికి ఊహ తెలిసిన మిత్రులు కావాలి. ఈ హంగులుంటేకాని ఎక్కడో గున్నమావి కొమ్మల్లో ఉన్న గువ్వ కలంతో కలిసి పాడదు. ఒక్కొక్కసారి అసంపూర్తిగా ఆగిన పాట నెల గడిచినా ముగిసి రాదు. ఇంత ఎదురు చూశాక పాట చేతికొచ్చినా కాలంలో ఆ పాటకు మృత్యువు లేదు. కదలిపోయే గుండె ఉండాలే కాని కృష్ణకోయిల ప్రతి వసంతానికి తట్టి లేపుతూనే ఉంటుంది.

''గూడు నిద్రపోయినా గువ్వ మేలుకుంది
గొంతుమూగపోయినా గుండె మేలుకుంది''.

# 4. ఏవేళలో ఏపాట పాడిందీ కోయిల

కృష్ణశాస్త్రి చేసిన కవితా వ్యవసాయంలో పండిన మేలి పంటలు ఎన్నో ఉన్నాయి. ఆయన గొంతు సారిస్తే లక్షల మంది అనుయాయులు ఆయన వెంట పాడారు. పద్యం రాసినా, పదం పాడినా, ఉపన్యాసం చేసినా, రేడియో నాటకాలు కూర్చినా, అనేక విషయాల్లో వ్యాస పరంపరను వెలయించినా అన్నిట్లో కృష్ణశాస్త్రిగారి ప్రత్యేక ముద్ర ప్రత్యక్షంగా తెలుస్తుంది. స్వేచ్ఛను ఊపిరిగా స్వీకరించి, 'తరతరాల నిగళాలను త్రెంచి తిమిరలత తారకా కుసుమములదాల్చినట్లు కర్కశ శిలలు సజీవ కళల దేలినట్లు మోడు చివురించినట్లు గానం చేస్తూ తన స్వేచ్ఛాగానంలో

''క్రౌర్య కౌటిల్య కల్పిత కఠిన దాస్య
శృంఖలములు తనంతనె చెదరిపోవ
గగన తలము మార్మోగగ కంఠమెత్తి
జగము నిండ స్వేచ్ఛాగాన ఝురులనింతు''

అంటూ స్వేచ్ఛకై ప్రాణ సుమములర్పించువారికి అమర జీవిత ఫలము ధన్యతను గాంచు నన్నారు. ఇలా స్వచ్ఛమైన స్వేచ్ఛను స్వీకరించిన కృష్ణశాస్త్రి పాడి ప్రపంచాన్ని పరవశింపజేసిన కావ్యాల్లో కొన్ని ఖండకావ్య సంపుటలు, కొన్ని వ్యాస సంపుటలు ముఖ్యమైనవి. ఈ ప్రకరణంలో ఆయన కావ్యాలను పరిచయం చేస్తాను..

కృష్ణశాస్త్రి కావ్యాల్లో మొదటిది, ఆయన ప్రతిభను వేనోళ్ల చాటినది 'కృష్ణపక్షము'. 1925లో అంతవరకు తాను రాసిన పద్య గేయ ఖండికలను చేర్చి

'కృష్ణపక్షము' అనే పేరుతో ప్రకటించారు. 59 శీర్షికలున్న ఈ గ్రంథం పద్య గేయ మిశ్రమం. కాని కృష్ణపక్షమనే మకుటంతో ఏశీర్షికా లేదు. కాకపోతే ''నాకు మరణమ్ము...' అనే శీర్షిక క్రింద రాసిన తేటగీతి పద్యాల్లో ఒక్కచోట ఆ పదం కనిపిస్తుంది.

ప్రియుడు తనకు మరణం వలదని వాంఛిస్తాడు. మహాంధకార కలుషితమైన కృష్ణపక్షము వంటి చీకటి వీధులందు తనతో కలసి కష్టాలు పంచుకున్న తన సహధర్మచారిణి, మధురమూర్తి, ప్రియురాలు, సఖురాలు పూర్ణానురాగ కలిత తనకు దూరమైపోతుందనే భయం వల్ల

''నాకు మరణమ్ము వలదనినాను; కాని
మరణము లేత నుడి చెవిం బడిన యంత
వడ వడ వడంకగా శిలాజడిమ గనగ
తలిరుగాలికి శుష్కపత్రమ్ము కాను.
తుది మొదలు కాని కానరానిది మహాంధ
కార కలుషిత కృష్ణపక్షంపు వీథి
కరము కరమున కీలించి కలసి మెలసి

మన్న సహధర్మచారిణి, మధుర మధుర
మూర్తి, ప్రియురాలు, సఖురాలు, పూర్ణరాగ
కలిత, నా దుఃఖ, మసువులే తొలగిపోవ,
వీడిపోవు నేమో యను వెరపు వలన
నాకు మరణమ్ము వలదనినాను-''

ఇలా ఒక పద్యంలో వాడిన ఒక మాటను గ్రంథనామంగా స్వీకరించడంలో ఎంతో 'సింబాలిజం' ఉంది. చీకటిని స్ఫురించే రేయి, నిశీధి, తమస్సు, అంధకారం, రాత్రి వంటి ఎన్నో పదాలుండగా, కవి 'కృష్ణ పక్షము' పదాన్ని ఎంచుకోవడంలో పదాలలో వ్యక్తంకాని కాలప్రమాణం దాగి వుంది. పద్నాలుగు చీకటి రాత్రులున్న కృష్ణపక్షాన్ని తనలో సగమైన, చేయి చేయి కలిపి కష్ట సుఖాలు పంచుకున్న అర్థాంగి తనను అంధకారంలో ముంచి వెళ్లిపోయిన విషాద సన్నివేశానికి 'సింబాలిక్'గా ఈ పదం వాడారని చెప్పవచ్చు.

ఈ కావ్యాన్ని అచ్చు స్వచ్ఛమైన భావగీతంతో ఆరంభించారు.

''ఆకులో ఆకునై పూవులో పూవునై
కొమ్మలో కొమ్మనై నునులేత రెమ్మనై
ఈ యడవి దాగిపోనా

ఎట్లైనా

నిచటనే యాగిపోనా ?
గలగలని వీచు చిరుగాలిలో కెరటమై
జల జలని పారు సెలపాటలో తేటనై
ఈ యడవి దాగిపోనా

ఎట్లైనా

నిచటనే యాగిపోనా ?
పగడాల చిగురాకు తెరచాటు తేటినై
పరువంపు విరిచేడె చిన్నారి సిగ్గునై
ఈ యడవి దాగిపోనా

ఎట్లైనా

నిచటనే యాగిపోనా ?
తరువెక్కి యల నీలగిరి నెక్కి మెలమెల్ల
చదలెక్కి జలదంపు నీలంపు సిగ్గునై
ఈ యడవి దాగిపోనా

ఎట్లైనా

నిచటనే యాగిపోనా ?
ఆకలా దాహమా చింతలా వంతలా
ఈ కరణి వెఱ్ఱినై యేకతమ తిరుగాడ
ఈ యడవి దాగిపోనా

ఎట్లైనా

నిచటనే యాగిపోనా ?

కృష్ణకోయిల చేసిన వసంత గానం ఈ పాటలో పలుకుతుంది.

కృష్ణపక్ష కావ్యంలో గొప్ప కవితా ఖండిక 'అన్వేషణ'. తనకు తానే గోపికయై వంశీ మోహనుడైన గోపాల దేవుని కవి వెతకడం అన్వేషణలోని ప్రధాన ఇతివృత్తం. సగము సడలిన పతి పరిష్వంగమందు సుఖము, దుఃఖము లేని సుషుప్తిలోన, శరద్రాత్రి చంద్రాతపాంతరాళ రమణీయ రజిత తల్పమునందు చల్లగా నిద్రపోవుచున్న గోపికను మేలు కొలిపింది మురళీనాథుని వంశీరవం. సెలయేటి కెరటాలలో తేలిపోతున్న విరికన్నె వలపులాగాను, తొలిప్రొద్దు తెమ్మెర త్రోవలో పయనమై పరిగెత్తు కోయిల పాటగాను, తెల్లని వెన్నెలలో కలసి కరగి పోతున్న మబ్బుతునక లాగాను, తీయదనమై గోపికా హృదయాంతరాళాన్ని తన్మయత్వంలో ముంచి తట్టిలేపింది వంశి అనంత సంగీత మకరంద మాధుర్యాన్ని చవిచూపిన గోపికా నాథుని వెదకుచు ఆయన పల్లె వదలి, ప్రాణనాయకుని పట్టువొదలి యమునా సైకత భూమిలో వెర్రిగా తిరుగసాగింది. ఇక్కడ ఆమె భావనలోని ఔన్నత్యాన్ని వివరిస్తూ ఉదాత్త గంభీరమైన భాషను ప్రయోగించారు కృష్ణశాస్త్రి.

> ''శారద శర్వరీ మధుర చంద్రిక,
> సూర్యసుతా స్రవంతికా
> చారు వినీల వీచిక ప్రశాంత
> నిశా పవనోర్మి, మాలికా
> చరిత నీప శాఖిక, కృశాంగిని
> గోపిక నేను, నాడు బృం
> దా రమణీయసీమ వినినారము
> మోహన వేణుగానమున్''

గోపిక బాలగోపాలుని సొగసును ''చూచితిరో లేదో చిన్ని కృష్ణుని సొబంగు ?' అంటూ మళ్లీ మళ్లీ వర్ణిస్తుంది. విభుని వీడి శుష్కించు విరహిణి సెలయేటి కడుపులో దాగిన కడలి మ్రోతలాగా గోపికా హృదయ మందిరంలో వేణు గానం తృళ్లింత పడుతుంది.

కృష్ణశాస్త్రి జీవితమే అన్వేషణగా జీవించి మురళీమోహనుని 'ధ్యానభజన'లో మధుర భక్తిని పండించిన అపర జయదేవుడు. లోకనీతికి,

సంప్రదాయ రీతికి భిన్నంగా, శ్రీకృష్ణునికి తనకు తాను అర్పించుకున్న రాధగా జయదేవ కవి ఆలపించిన భావ సౌందర్యాన్ని పూతగా స్వీకరించి కృష్ణశాస్త్రి అన్వేషణ రాశారు. మధుర భక్తితో మాధవుని సాన్నిధ్యాన్ని అపేక్షించిన కృష్ణశాస్త్రి అన్వేషణ ఫలించిందా ? అనేది ప్రశ్న. సత్యాగాములైన భక్తుల అన్వేషణ ఫలించదు. గమ్యాన్ని చేరుతుంది.

కృష్ణశాస్త్రి కృష్ణపక్షంలో ఈ అన్వేషణలోనే ప్రేమను క్రుమ్మరిస్తారు. ఒకసారి గోపికయ్యై ప్రాణవల్లభుని కోసం కలవరిస్తారు. మరొకసారి ప్రియుడుగా తన ప్రాణ కాంత కోసం తపిస్తారు. మాటిమాటికి ప్రేయసి కోసం అన్వేషిస్తారు.

''ప్రేయసీ, ప్రేయసీ ! ప్రియుడనే ప్రేయసీ !
వేయి కన్నులు దాల్చి వెదకుచున్నానే !
నల్ల మేఘాలలో న్యాయమా దాగంగ ?
తల్లడిలవో నన్ను తలచి రావో !
మెరపువై యొయ్యారి మెరుపువై కాన్పించి
యరసినంతనే మబ్బు తెరల దాగితివా !
తళుకుమని కనిపించి వలపు వెల్లువ ముంచి
వలపించి మాయమ్మై వనట గూర్చితివా !
''నల్ల మబ్బుల నింగి నా సౌధరాజమ్మ
నల్లమబ్బే ప్రియుడు నన్ను గోరకుమా !''
ఆడుచును బాడుచును హాయిగా నవ్వుచును
పాడు మేఘాలతో పరుగెత్తె మెరపు !

సంప్రదాయ నిగళాలు తెంచుకొని స్వేచ్ఛ కోసం పరితపించి స్వేచ్ఛాగానం చేశారు కృష్ణశాస్త్రి. ఈయన స్వేచ్ఛా ప్రియత్వాన్ని గూర్చి చెబుతూ కృష్ణపక్ష సింహావలోకనంలో తల్లావఝల శివశంకరశాస్త్రి ''ఈ స్వేచ్ఛా ప్రియత్వము బహువిషయముల గానవచ్చుచున్నది. సంప్రదాయానుగతములైన ఛందస్సులనేగాక నూతన ఛందములను గూడ గ్రహించి వానిలో భావములను బాగుగా పలికించి రసమొప్పించుట; పాద భాగములో ఖండిక ప్రారంభించుట; పాదాంతము కాకుండనే కావ్యము ముగించుట; నూతన ప్రయోగములు చేయుటలో వెనుదీయకుండుట; కొన్ని ఖండికలకు నామముంచకుండుట

ఇత్యాది విశేషములు సహృదయులకు నవ్యకళ లాపాదించు గుణములుగా గోచరించును'' అన్నారు.

జాతీయోద్యమంలో భరత జాతి స్వేచ్ఛ కోసం పరితపిస్తున్న కాలంలో భావకవులు కూడా స్వేచ్ఛకోసం, స్వేచ్ఛాభావాల కోసం కలం పట్టి పోరాటం జరిపారు. కృష్ణశాస్త్రి ఆ ప్రభావంతోనే

''క్రౌర్య కౌటిల్య కల్పిత కఠిన దాస్య
శృంఖలములు తమంతనె చెదరి పోవ
గగన తలము మార్మ్రోగగ కంఠమెత్తి
జగమునిండ స్వేచ్ఛాగాన ఝురుల నింతు'' అంటారు.

దేశమాతను బంధించిన కఠిన దాస్య శృంఖలాలు చెదిరిపోయినట్లు గగన తలం మారు మ్రోగేటట్లు కంఠమెత్తి స్వేచ్ఛాగానం చేస్తానన్నారు.

ఇలాగే ఈ ఖండకావ్య సంపుటిలో ఆత్మాశ్రయ రీతిలో 'చుక్కలు' అనే ఖండిక వస్త్వాశ్రయానికి దగ్గరగా'అన్వేషణ', ప్రేమను వర్ణిస్తూ 'అతని పాట' 'ఏల ప్రేమింతును' 'నాప్రేమ' 'ప్రాణకాంత' వంటి గీతమాలికలు రాశారు. విషాద భావనలో 'దుఃఖము', నేనొకండ', 'ఓయి సంధ్యా సమీరణా', నిశాలోచనము', 'నన్నుగని', 'నేను కూడ' 'మీరు మనసారగా!', 'స్వాదు సంగీత', 'ఈ నిశీథిమధ్యమున', 'క్రుంగిపోదు' వంటి గీతమాలికలు, గేయమాలికలూ ఎన్నో ఉన్నాయి. భార్యావియోగంతో తపించిపోయిన శాస్త్రిగారు దుఃఖంలో ఈ విషాద కావ్యాలు రాశారు.

''నాకు మరణమ్ము వలదనినాను కాని
మరణ మను లేత నుడి చెవిం బడిన యంత
వడ వడ వడంకగా శిలాజడిమ గనగ
తలిరుగాలికి శుష్కపత్రమ్ము కాను''

'అశ్రువులను మాయం చేసే మరణం కన్నా జీవించి ఆమె కోసం దుఃఖించడమే తనకానందం' అంటారు.

ఇంకా ఈ సంకలనంలో వారి తండ్రి పెదతండ్రులను గురించి ఏడు ఖండికలు చెప్పారు. అన్నిటికీ 'మాబాబయ్య, నాన్నగారు' అనే పేరు పెట్టారు.

ఈ ఖండికల్లో దేవులపల్లి సోదర కవుల చెలిమి, ప్రేమలతో పాటు వారి పట్ల కృష్ణశాస్త్రిగారికున్న భక్తి వెల్లడవుతుంది.

అన్నిటినీ మించి గురజాడ వారి వైతాళిక గానంతో కృష్ణశాస్త్రి చైతన్య మనస్కులైనారు. గురజాడ అప్పారావు గారి పట్ల బాల్యంలోనే తన మనస్సులో నాటుకుపోయిన గౌరవాన్ని వెల్లడిస్తూ 'మహాకవి' శీర్షికతో ముత్యాలసరాలు చెప్పారు. ముత్యాల సరాల కర్తను కీర్తించడానికి ముత్యాలసరాన్నే స్వీకరించారు.

''గుత్తునా యని జాతి ముత్యాల్
గుచ్చినాడే మేలి సరముల
ఇత్తునా యని తెలుగుతల్లికి
ఇచ్చినాడే భక్తితో! ''

ఈ గీతంలో మహాకవి గురజాడ పట్ల కృష్ణశాస్త్రి కున్న భక్తి భావం వ్యక్తమౌతుంది. గురజాడ నవ్యమార్గానికి కృష్ణశాస్త్రి పలికిన సమర్థన స్పష్టమౌతుంది.

గురజాడ వ్యతిరేకులను అధిక్షేపించడం, ఆయన గీతాల్లోని గొప్పతనాన్ని, నవ్యమార్గంలోని నవ్య సంధానాన్ని సమర్థించడం ఈ గేయంలో పలుకు పలుకులో కనిపిస్తుంది.

1929లో జ్వాల పత్రికను నడుపుతున్న ముద్దుకృష్ణగారు 'ప్రవాసము-ఊర్వశి' అనే సంపుటిని ముద్రించారు. ఆ తరువాత 'కృష్ణపక్షము -ప్రవాసము-ఊర్వశి' కలసి ఒకే సంపుటిగా ఎన్నో ముద్రణలు పొందాయి. 'కృష్ణపక్షము' లోని వియోగం నుండి 'ప్రవాసము' లోని దుఃఖం, ఆ దుఃఖం నుండి గమించిన నాయిక 'ఊర్వశి' అని చెప్పవచ్చు. అంటే ఇది క్రమానుగత పరిణామం. వియోగంలో బాధపడడం, బాధనుంచి దుఃఖం పొర్లిరావడం, ఆ దుఃఖాన్నే సౌఖ్యంగా అనుభవిస్తూ ప్రవాస గీతాలల్లడం, ప్రవాస గీత మాధుర్యాన్ని భావనకు తనియించి ఆ భావనలో దివినుండి దివ్యమూర్తి 'ఊర్వశి'ని భువికి దించారు కృష్ణశాస్త్రి.

తెలుగులోనే కాదు మొత్తం ప్రపంచ భాషలన్నిటిలో కూడా భావ సాహిత్యంలో శృంగార నాయికకు శిఖర స్థానం ప్రాప్తించింది. అంతకు ముందు ప్రాచీన సాహిత్యంలో ఏ కవీ తాను నిత్య జీవితంలో ఆరాధించిన సుందరికి

కవిత్వంలో పట్టాభిషేకం కట్టలేదు. భారతీయ వాఙ్మయంలో అలా అడుగువేసిన మొదటి కవి జయదేవుడు. అతడు పద్మావతీ చరణ చారణ చక్రవర్తి. తరువాతి కాలంలో శ్రీనాథాది కొందరు కవులను గూర్చి శృంగార గాథలు జనశ్రుతిలో ఉన్నా అవి అక్షరాకృతి పొందలేదు. కాని పాశ్చాత్య సారస్వతంలో ఇలా తాము ప్రేమించిన సుందరిని ఆరాధించిన కవుల్ని చాలా మందిని చూస్తాం.

ఇటాలియన్ కవి డాంటే (Dante) తనను ప్రేమించి పెళ్లాడి యుక్తవయస్సులోనే మరణించిన బ్యాట్రిస్ పోర్టినారీ (Beatrice Portinari)ని తన డివైన్ కామెడీ (Divine Comedy)లో తనివితీరా వర్ణించాడు. పెట్రార్క్ అనే ఇటలీ కవి 'లారా'(Laura) అనే వివాహిత స్త్రీని ప్రేమించి, ఫలించని ప్రేమకోసం, లారా కోసం 366 ప్రేమగీతాలు రాశాడు.

అలాగే ఇంగ్లీష్ కవి 'సిడ్నీ' ప్రేయసి 'స్టెల్లా' కోసం 'అస్ట్రోఫెల్ అండ్ స్టెల్లా' అనే ఆప్రణయకావ్యం రాశాడు. షేక్స్పియర్ 'డార్క్‌లేడి' నుద్దేశించి రాసిన సానెట్లు అట్లాంటివే ! 'ప్యానీబ్రౌన్' ని ప్రేమించి ఆమె తృణీకారానికి గురై 'కాట్స్' ప్రణయ గీతాలాలపించాడు. 'షెల్లీ' తాను ప్రేమించిన 'హారియట్‌గ్రోవ్', 'ఎమీలియా విపియాని', 'మిసెస్ విలియమ్స్' యువతుల ప్రేమలోనే ప్రణయ కావ్యాలు రాశాడు. అలాంటివారే 'బైరన్', 'బ్రౌనింగ్', 'స్విన్‌బర్న్' మొదలైనవారు.

ఈ కవుల కవితల ప్రభావంతోనే మన భావకవులు కూడా ప్రణయ కావ్య రచనకుపక్రమించారు. కొందరు జీవిత భాగస్వాములను కావ్య నాయికలుగా పాడుకున్నారు. అలాంటివారిలో శివశంకరశాస్త్రి గారి 'హృదయేశ్వరి', నాయని సుబ్బారావు గారి 'వత్సల' ముఖ్యమైనవారు.

మరికొందరు కవులు ఊహానాయికలను కావ్యనాయికలుగా మలచు కున్నారు. అటువంటివారిలో మన కృష్ణశాస్త్రిగారి ఊర్వశి, అడవిబాపిరాజుగారి 'శశికళ', విశ్వనాథవారి 'కిన్నెర' నండూరి సుబ్బారావుగారి 'ఎంకి' ముఖ్యులు.

ఊర్వశి సృష్టిని గురించి స్వయంగా చెప్పారు కృష్ణశాస్త్రి '' ఒక ఆంధ్రకవి కృష్ణపక్షంలో ప్రవాసియై తిరిగి తిరిగి, కంటబడిన ప్రతిలావణ్యాన్ని కదిపి కదిపీ, ప్రక్కన మ్రోగిన ప్రతి హృదయాన్ని పలకరించి పలకరించీ, లోకంలో తనకు నచ్చిన సౌందర్యం లేదనే, తన్ను ప్రేమించి తాను ప్రేమించే ప్రేయసి లేదనే

కృంగిపోయి, కృంగిపోయీ ముచ్చిచ్చులో వేగి వేగి, ''నాకుగాదులు లేవు, నాకుషస్సులు లేవు'' అన్న నరకంలోకి వచ్చాక, తపస్సు పూర్తి అయ్యాక, శాంతచిత్తుడై తానే ప్రేయసిని సృష్టించుకున్నాడట.'' ఇలా లావణ్యాన్ని కదపడానికి, ప్రక్కన మ్రోగే ప్రతి హృదయాన్ని పలకరించడానికి ఎంతటి దుఃఖాన్ని వెచ్చించి ప్రవాస గీతాలు ఆలపించాడో కృష్ణశాస్త్రి ఈ గీతంలో స్పష్టమౌతుంది.

''నేను మరణించుచున్నాను; ఇటు నశించు
నాకొరకు చెమ్మగిల నయనమ్ము లేదు;
పసిడి వేకువ పెండ్లిండ్ల పడిన యెవరు
కరుగనేర్తురు జరఠాంధకార మృతికి ?

నా మరణశయ్య పరచుకొన్నాను నేనె !
నేనె నాకు వీడ్కోలుపు విన్పించినాను !
నేనె నాపయి వాలినా, నేనే జాలి
నెదనెద గదించినాను, రోదించినాను !

బ్రతికియున్న మృత్యువునై ప్రవాస తిమిర
నీరవసమాధి క్రుళ్ళి క్రుంగినపుడేని
నిను పిలిచినాన, నా మూల్గునీడ ముసిరి
కుములునేమొ నీ గానోత్సవముల ననుచు ?

ఇదియె నా చితి, పేర్చితి, నేనె దీని
వదిలిపోని నా యవసానవాంఛ గాగ
వడకని కరాలు రగులుచు దుడుకు చిచ్చు
లాలనల నింత నుసిగాగ కాలు త్రుటినె !

అలయు వాతెర యూర్పుగాలులు కదల్చి
రేపునంతె నా కాష్ఠాల రేగు మంట
మును బ్రతుకునట్లు నాదేహమును దహింపు !
పడదులే ఆర్పగా నొక బాష్పమేని !''

ఆ దుఃఖం నుంచి తన ఉనికిని నిర్ధారించుకున్నారు. తనకు తానే ఊపిరి పోసుకున్నారు.

''నా నివాసమ్ము తొలుత గంధర్వలోక
మధుర సుషమా సుధాగాన మంజువాటి,
ఏనొక వియోగగీతిక
నేను నిదుర
వెన్నెలల దారి నొకరేయి వెడలిపోతి
నొక విపంచీ విరహకంఠ మొరసి యెగసి.
ఏనొక వియోగశాలినీ హృదయరాగ
వేదనారేఖ, నాకలివేగు నామె
యంగుళీకిసలయ చంచ లాంచలముల
విడివడి యనంత విశ్వాన బడితినాడు.
అదియె మొద లేను సకల దిశాంతరాళ
మెల్లెడల నెందుకో పర్వులెత్తిపోవ !
ఆ సమయ మాదిగా నప్సరాంగ నాను
రాగ వీథుల, కిన్నెరీ రమ్యకంఠ
సీమలో, శ్రావణాంబు దాశ్లేషపాళి,
తారకాలోక పంక్తుల, మారు తోరు
పక్షముల, తిరుగాడుచు పవలు రేలు,
కన్ను మోడుపు మెయి వాల్పుగాని లేక !
ఇది ముగియబోని ఏ యర్థ మెరుగరాని
వేసటే లేని వెర్రి యన్వేషణమ్ము !
ఈ ప్రవాస యాత్రారతి నిటులె నేను
కదలి పోవుదు నాశావకాశములను
ఒక్క నిట్టూర్పు వోలిక, ఒక్క మౌన
బాష్ప కణ మటు, ఒక గాఢవాంఛ పగిది.''

తనకు గాదులు లేవని, ఉషస్సులు రావని, తన జీవితం వలె కాలం కూడా చీకటి మయంగా కనిపిస్తుందని వాపోయారు.

''నాకు గాదులు లేవు
నాకుషస్సులు లేవు
నేను హేమంత కృ
ష్ణానంత శర్వరిని.

నాకు కాలమ్ముమ్రొక్క-
టే కారురూపు, నా
శోకమ్ముమవలెనె, నా
బ్రతుకువలె,
నావలె.''

ఆయన బాధను ఏ గంధర్వులాలకించారో, ఏ వసంతుడు విశ్వ ప్రేయసి ఊర్వశికి తెలియజేశాడో ఆమె, నిశీథిలో వెల్గు రేఖలా కవి హృదయ కవాటాన్ని తట్టి లేపింది.

''ఎవరోహో ఆ నిశీథినెగసి, నీడవోలె నిలిచి
పిలుతురెవరో, మూగకనులు, మోయలేని చూపులతో
ఎవరోహో ! ఎవరోహో !''

అవును, చలం అన్నట్లు ''కృష్ణశాస్త్రి బాధ ప్రపంచానికి బాధ'' మాత్రమేకాదు సర్వలోకాలను కదిపివేసిన గాథ కూడ !

ఊర్వశిని ఎంతో మంది కవులు ఇంతకుముందే పలకరించి పలవరించారు. వాల్మీకి, కాళిదాసు, భవభూతి మొదలుకొని రవీంద్రునిదాకా ఎంతోమంది ఆమె ఉనికిని చాటినవాళ్లే. ఉర్వశి కాకపోయినా ఉర్వశి వంటి ప్రేయసి కోసం పాశ్చాత్య కవులైన హూమరు, శాఫో మొదలుకొని షెల్లీ దాకా ప్రేమగీతాలల్లినవాళ్లే. అయితే కృష్ణశాస్త్రి భారతీయ కవుల్లా కథలల్లలేదు. పాశ్చాత్య కవుల్లా కేవలం ప్రణయగీతాలు మాత్రమే పాడలేదు. ఆమెకోసం నిశీథిలో అన్వేషించారు, తపించారు. కళ్ళలో వత్తులు వేసుకొని నిరీక్షించారు. ఎదలోపలి ఎదలో దాచుకున్నారు.

''విదలోపని యెదలో, నె
మ్మదిలో, జీవిత రహస్య మార్గమ్ములలో
వదలని కోరికవై, నా
బ్రదుకు బరువు లెల్లపాట పాడింతు సఖీ !''

అని పలవరించారు.

''ఊర్వశీ ! ప్రేయసీ ! నేడో, యుష్మదీయ
చరణ కరుణా మధుకణమ్మె దొరకు నేమొ,
మూడు లోకాల సుఖ మొక్కముడి నిమిడ్చి
నిసర లేనొ కాలాంతమే వెనుక ప్రాక !''

ఆమెను సౌందర్యాధి దేవతగా భావిస్తారు కృష్ణశాస్త్రి. ఆమె కన్నులలో అనంతమైన ఆకాశపు నీలినీడలు కలవని, ఆమె కన్నులలో నిర్మల పూర్ణ ప్రశాంత గంభీరమైన బాష్ప సముద్రాలు కలవని చెబుతారు. ఆమె కళ్ల అపూర్వ మధుర భక్తిని స్ఫురించి అర్థం కాని భావగీతాలని పోల్చారు.

''ఆమె కన్నులలో ననం తాంబరంపు
నీలి నీడలు కలవు
వినిర్మలాంబు

పూర గంభీర శాంత కాసార చిత్ర
హృదయములలోని గాటంపు నిదురచాయ
లందు నెడనెడ గ్రమ్ము;
సంధ్యావసాన

సమయమున నీపపాదప శాఖి కాగ్ర
పత్ర కుటిల మార్గముల లోపల వసించు
ఇరుల గుసగుసల్ వానిలో నిపుడు నపుడు
వినబడుచు నుండు;
మరికొన్ని వేళలందు

వానకారు మబ్బుల మెయివన్నె వెనుక
దాగు భాష్పమ్ము లామె నేత్రముల లోన
పొందుచుండును;
ఎదియొ అపూర్వ మధుర
రక్తి స్ఫురియించుగాని అర్థమ్ముకాని
భావగీతమ్ములవి''.

లోకదేవతయైన ఊర్వశిని ఆమె కటాక్షం కోసం వేడుకున్నారు కవి. ఊర్వశి కవిని మనసారా కటాక్షించింది. ''ఆనాటికీ నాటికేను నీదాననే'' అంటూ నమ్మకంగా పాడింది.

''కాలమే పసిపాప కనువిచ్చిన యుషస్సు
కలగా కలవరించి వెలుగుగా పులకించి
ఇరుల కడు పొరసి నే తెరచి వాలిన నాడె
మిసిమి వన్నెల మేన మసి జాలిగా నయ్యె.....

తొలి వియోగిని నేనె !
తొలి ప్రేయసిని నేనె !

ఆనాటికీ నాటి కేను నీ దాననే !
మున్నీటి తరగలకు మిన్నేటి నురుగులకు
తడయు నెడబా టేనే ! విడని కౌగిలి నేనె !
వాన చినుకుగ సాగసి వలపు చూపుగ నెగసి
పడిపోవుదును నేనె ! పరువులిడుదును నేనె !

తొలి వియోగిని నేనె !
తొలి ప్రేయసిని నేనె !

ఆనాటికీ నాటికేను నీ దాననే !''

కవి ఆనందభరితుడైనారు. ఆమె ప్రణయాన్ని అనంతమైన భావ ప్రవాహంతో పాడుకున్నారు.

''నాకు మాత్రముగాన మున్నంతవరకు
చాలు చాలు నీ ప్రణయ విశ్వాస మొకటె,
మోసికొందునో నా గీతములను నిన్ను!
మూగవోదునో రాయియ్యె పోయి చిరము!''

ఆమెను తన హృదయంలో పదిలంగా దాచుకున్నారు. ఆమె స్మృతులనే శృతులుగా మార్చి పాడుకున్నారు.

''నాహృదయమందు విశ్వవీణాగళమ్మ
ఘోరు ఘోరున నీనాడు మ్రోతవెట్టు
దశ దిశాతంత్రులొక్క సుధాశ్రుతిని బె
నంగి చుక్కల మెట్లపై వంగి వంగి
నిలిచి నిలిచి నృత్యోత్సవమ్ముల చలించు.''

కృష్ణశాస్త్రికి ఊర్వశిని గురించి అంతా తెలుసు. ఆమె అనుపానులన్నీ ఆయనకు సుపరిచితాలే. సుధర్మాస్థానంలో ఆమె ఏమూల నిలుచుంటుందో తెలుసు. నందనవనంలో పారిజాత సానువుల్లో ఆమె ఇల్లు కట్టుకుందని తెలుసు. ఆమెను తన విషాద ప్రేమ గీతాలతో మేలుకొల్పి తన వెంట తెచ్చుకున్నారు కవి. ఈ లోకాన్ని స్వర్గతుల్యంగా మార్చుకున్నారు. ''నువ్వు నాపక్క నుండు, నేను లోకాన్ని వైకుంఠం చేస్తాను'' అన్నారు.

విశ్వకవి రవీంద్రుడు తన కావ్యంలో ఊర్వశిని ''నహోమాతా, నహోకన్యా, నహోవధూ'' అన్నారు. ''అనంతయౌవనా'' అని సంబోధించారు. కృష్ణశాస్త్రి ఆమెను ''తొలిప్రొద్దున కురిసేనును మంచు . తీవసోనగా, ఋతుకలయికతో పొడమిన సంధ్యా కుమారిగా, చీకట్ల విశ్వాలతో మాసి కుమిలిపోయే రాత్రి వియోగ కపోల పాళికగా, కన్నీరుగా, విశ్వవేదనా మూల్యంగా వర్ణించారు. విషంతో, అమృతంతో, చీకటితో, వెన్నెలతో కలసిన ప్రేయసిగా ఊర్వశిని ఊహించుకున్నారు.

ఆయన ఒక్కటే అంటారు ''ఈ ప్రపంచంలో ఎవరికైనా అమ్మ సీతమ్మ, ప్రేయసి, ఊర్వశి'' అని.

కృష్ణశాస్త్రి కవితా స్రవంతిలో ఈశ్వరారాధన ప్రధానమైన భాగం ప్రకృతిలోని ప్రతి అణువులో ఆయన ఈశ్వరుణ్ణే దర్శిస్తారు. రఘుపతి

వెంకటరత్నం నాయుడుగారి శిష్యరికంలో బ్రహ్మసమాజంలోని విశాల మానవ దృష్టి సంకల్ప శక్తి ఆయనకు నైతిక బలాన్నిచ్చాయి. వైష్ణవ గీతాల్లోని వర్ణనా మాధుర్యాన్ని ఆకళింపు చేసుకున్నారు. వీటికి తోడు ఆయన భావనలోని అణువణువు లయతో ఊగిపోయేది. ఈ సంగమంలో ఆయన లేఖిని నుంచి జాలువారే ప్రతి గేయంలోనూ శబ్దార్థాల పొందికలో లయ నాట్యం చేస్తుంది. ఆయన రచనల్లో కృష్ణభక్తి అంతర్వాహినిగా సాగుతున్నా ప్రకృతిలో ప్రతి అణువులోనూ ఆయన పరమేశ్వరుణ్ణే దర్శించారు. ఏకేశ్వరోపాసనతో అందరు దేవుళ్ళనూ తృప్తి పరచారు.

కృష్ణశాస్త్రి భక్తిగీతాలు 'అమృత వీణ', 'మంగళకాహళి' అనే సంపుటాలుగా వెలువరించారు. ఇవి ఒక్కొక్కటీ ఏడెనిమిది గేయ సంహితల సంపుటాలు. 'అమృతవీణ' సంపుటి, కృష్ణ రజని, కన్నీరు, మహతి, మధుమురళి, గుడిగంటలు, ఋతుఖేల, విరితూపు, అనే సప్తస్వర సమ్మిళితం. నిరాశ, కరుణ, ఆర్తి, భక్తి, ప్రణయం, ప్రకృతి ఆరాధన, పుణ్యప్రేమ ఈ సప్తస్వరాల అంతర్నాదాలు. 'మంగళకాహళి' దేశభక్తి గీతాలతోనూ, తెలుగుజాతి జీవన సన్నివేశ కీర్తనలతోనూ కూర్చింది. కవి తననొక అల్పునిగా భావించుకొని సర్వ శక్తివంతుడైన భగవంతుని దయామయునిగా భావించి ప్రార్థించడం ఆయన ప్రతి పాటలోను కనిపిస్తుంది.

''ఏచోట దాచినదో ఈ చైత్ర జీవమ్ము
ఇన్నాళ్ళు మాకనుచు దేవా !
ఈ చీకు హృదయాలు వేచి కననే లేవు
నీ చిత్రములు దేవదేవా !''

అంటూ విచిత్రమైన భగవంతుని లీలావిన్యాసాలను వర్ణిస్తారు.

''నానోట నీమాట గానమయ్యే వేళ
నా గుండె నీవుండి మ్రోగింపవా వీణ?
రాగ మెరుగని వీణ, రక్తి నెరుగని వీణ
తీగపై నీచేయి తీయకే గడియేని !

అంతరాంతము నీ అమృత వీణే యైన
మాట కీర్తన మౌను, మనికి నర్తనమౌను !
ఈ అనంత పథాన ఏచోటి కాచోటు
నీ ఆలయ మ్మౌను, నీ ఓలగ మ్మౌను !

అని మానవుని మనో వీణను మీటి జీవనాదాన్ని పలికిస్తున్న భగవంతుని కీర్తిస్తాడు. భావ పరిపక్వతలో పండిపోయిన కవి తనకు, భగవంతునికి అభేద సాదృశ్యాన్ని సాధిస్తారు.

''నా వలెనె యాతడున్మత్త భావశాలి
ఆగికోలేడు రేగు నూహల నొకింత
ఇంత చిరుగీతి యెద వేగిరించునేని
పాడుకొనును తాండవనృత్యమాడుకొనును
ఏనెఱుంగుదు నావలెనే యతండు
పాట పదములకై నిత్య పథికుడయ్యె''

కీర్తన పలకడంలో అన్నమయ్య, త్యాగయ్య వంటి వాగ్గేయకారుల వారసత్వంతో పుట్టారు కృష్ణశాస్త్రి.

''పాటలలో యీాయనను దరిజేరగలవారు లేరు'' అని ముద్దు కృష్ణ, ''క్షేత్రయ్య తరువాత ఇంతటి వాగ్గేయకారుడు పుట్టలేదు'' అని ఇస్మాయిల్ కవి చెప్పిన మాటలు ప్రత్యక్షర సత్యాలు.

''మ్రోయింపకోయ్ మురళి,
మ్రోయింపకోయ్ కృష్ణ !

తీయ తేనియ బరువు
మోయలేదీ బ్రతుకు ॥మ్రోయింపకోయ్॥

మురళి పాటకు రగిలి
మరుగు నీ వెన్నెలలు !

సోగయు నా ఎద కేల
తగని సౌఖ్యజ్వాల ? ॥మ్రోయింపకోయ్॥

కాలు చల్లదనాలో !
కనలు తీయదనాలో !

వలపు పిల్లన గ్రోవి
పిలుపులో ! సొలపులో ॥మ్రోయింపకోయ్॥

వలదోయి ! అలము నీ
కనులలో నిదురింతు

భరమోయి ! నీ ప్రేమ
వరమే నేటి రేయి ॥మ్రోగింపకోయ్॥

ఈ పాటలో భగవంతుని పట్ల తనకున్న వలపు ద్యోతకమౌతుంది.

''గడియేని నీ వియోగము సహింపలేను
విడిపోని నీ చెల్మి విధమేమొ సెలవిమ్మ''

అని భగవంతుని వేడుకున్న భక్త శిఖామణి, ''నేను మీరనుకున్నంత భక్తుణ్ణే కాదు..... ఎప్పుడో హృదయ వేదన భరించలేనప్పుడు కేక పెడతాను అది కీర్తన అవుతుంది'' అనేవారు.

''వాడినతీగెకె గడియ గడియ కొక
వసంత కాలము దేవా !
మాడిపోవు నెండకారు నేలకె
మధుర వర్షమో దేవా !

దారిగాని దారిని అడుగున కొక
తారాదీపము దేవా !
పారబోసికొన్న పానపాత్రలో
తేనెసోన లో దేవా !

ఈ విశ్వాసము వీడని వారికి
భావిస్వర్గమో దేవా !

ఈ ఆశా సందేశము చాటెద
మాశాశల నో దేవా !

నిరాశ, నిస్పృహల కృష్ణపక్షం చేయి పట్టి భగవంతుడు ఈ జీవితంపై అపేక్షను కలిగించటాన్ని ఎంత గొప్పగా గానం చేశారు కృష్ణశాస్త్రి. గుళ్ళు, గోపురాలలో గాక భగవంతుని హృదయంలో వెతకమంటారు. సర్వ ప్రపంచంలో అతని జాడలు అన్వేషించమంటారు.

''శిథిలాలయమ్ములో శివుడు లేడోయి
ప్రాంగణమ్మున గంట పలుక లేదోయి
దివ్య శంఖము గొంతు తెరవ లేదోయి
పూజారి గుడినుండి పోవ లేడోయి

చిత్రచిత్రపు పూలు చైత్రమాసపు పూలు
ఊరూర నింటింట ఊరకే పూచాయి
శిథి లాలయమ్ములో శిల కెదురుగా కునుకు
పూజారి కొక టేని పూవు లేదోయి

వాడ వాడల వాడె ! జాడలన్నిట వాడె !
ఇంటి ముంగిట వాడె ! ఇంటింటిలో వాడె !
శిథిలాలయమ్ములో శిలను సందిట బట్టి
పూజారి వానికై పొంచి ఉన్నాడోయి''

కడకు తానే నాయికయై జగన్నాథుని పరిష్వంగం కోసం అహోరాత్రులు అలమటిస్తారు.

''ఒక సారి రావా ! దేవా !
ఒక నిముసమే ఇక నిలువనే లేను !

ఒక సారి రావా ! దేవా !''

ఎంతకూ కనికరించని ఆ భగవానునితో

''దాసిగా నుండుటకైనా
తగనా ప్రాణేశ, దేవ !

నీ సేవకై గాక నాకీ
నీరస జీవిత మేల'' అని వాపోతారు కృష్ణశాస్త్రి.

కృష్ణశాస్త్రి పద్య కవితా సంకలనం 'పల్లకి'. ఈ ఖండకావ్యంలో పల్లకిలో కూర్చున్న ముగ్ధ వధువు సౌందర్యాన్ని, తనకోసం ప్రియుడు పల్లకీ పంపినాడనే ఆనందాన్ని అద్భుతంగా చిత్రించారు.

''ప్రాణసఖుడె నా కోసమై పంపినాడు
పల్లకీ అన హృదయమ్ము జల్లు మనియె !
వీడని వియోగము వేగు మ్రోడు మేను
తలిరు తోరణమై సుమదామ మాయె !''

ఇంకా మహోత్ముడు, రాజారామమోహనరాయ్, బ్రహ్మర్షిమాట, గురుదేవుడు, బుద్ధ భగవానుడు, ధనుర్దాసు వంటి అనేక ఖండ కావ్యాలు ఈ సంకలనంలో వున్నాయి.

కృష్ణశాస్త్రి జీవితాన్ని తీర్చిదిద్దిన వారిలో ముఖ్యులు బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నం నాయుడు 'కృష్ణపక్షము'లో కవి వారి బాబయ్య, నాన్నగార్లపై ఖండ కావ్యాలను రచించినట్లు మహతి గీత సంపుటిని నాయుడు గారికి అంకితం చేసి భక్తిని చాటుకున్నారు. బ్రహ్మర్షి మాట అనే పేరుతో నాయుడుగారి సూక్తులను పద్యాల రూపంలో చెప్పారు.

వధూవరుల జీవితాల నొకటి చేస్తే 'సప్తపది' అని నాయుడుగారు నూతన రీతిలో నిర్వచిస్తే కృష్ణశాస్త్రి

''సత్యరతి, ధర్మగతి, గృహస్థవిధి, అతిథి
అర్చన, స్వదేశ సేవ, మఖిలమాన
వానురక్తి, యీశ్వరభక్తియని వధూవ
ర్వార్థ సప్తపది యనుచు బ్రహ్మర్షి మాట''.

అని పద్యరూపంగా చెప్పారు. తరుణ వయస్సులో నాయుడుగారి చరణ సన్నిధి లభించటాన్ని కృష్ణశాస్త్రి మహాభాగ్యంగా భావించారు.

''అపుడు నా గొంతు రవ్వంత కోయిల గాన
అపుడు నా మనసు ఆవంత ఉయెల గాన
అపుడు నా మనికి తరుణామ్ర శాఖికగాన
తలపించితిని అత్యల్ప గీతాలు కొన్ని
అప్పుడే ఒక మంగళా నిలము కొని తెచ్చి
అందిచ్చి పోయె అజరామరము నీవాణి
నా గీతి అప్పుడే నగలన్ని విడనాడి
శిరసు వంచెను ధూళివరకు నీ పదమాని''.

అన్నారంటే నాయుడు గారి ప్రభావానికి ఎంతగా ఆకర్షితులయ్యారో తెలుస్తుంది.

నాయుడుగారిని గురించి చెబుతూ ''పురాణాల్లో భారతంలో పుట్టిన యెడల నాయుడుగారు కృష్ణద్వైపాయనుడై యుండును.

పాశ్చాత్య జగత్తులో జన్మించిన యెడల సోక్రటీసై యుండును'' అన్నారు. ''నాయుడుగారి హృదయం శత తంత్రీ మహతి, ప్రతి వాయునిహతికినీ కంపించి పోయేది'' అన్నారు.

ఇంకా ''నీతి పద్ధతి గరువాన నిట్టనిలుచు
తావులందెల్ల ప్రేమ మస్తకము వంచి
యోర్చి గెలుపొంది పైకొన నేర్చునసుచు
నలరు దేనియతేట బ్రహ్మర్షి మాట''

అని ఆయనను స్మరించుకున్నారు.

''ఈ దివ్యర్షి పథమ్ము భారతమునందే పుట్టి, అధ్యాత్మికే
చ్ఛాదారిద్ర్యముచే నశించు ప్రియ శిష్య శ్రేయమాశించి ఆ
వేదానంత పథమ్ములన్ కదలిరావే ! తాల్చికోనిమ్ము నీ
పాదాంభోజ రజోలవమ్ము గురుదేవా మా శిరోవీధులన్ !''

అని తన గురుదేవునికి నమస్కరించుకున్నారు. ఋతుశోభను, ప్రకృతి కాంతలీలా మాధుర్యాన్ని కళ్ళారా చూచి, మనసారా అనుభవించిన కృష్ణశాస్త్రి వైష్ణవ భావ పరిపక్వతతో ఆండాళ్ళు 'తిరుప్పావై' ని ఆంధ్రీకరించారు. శబ్ద

మాధుర్యంతో పాటు రూప మాధుర్యాన్ని, అంతర్నేత్రంతో దర్శించి ఆనందించ గల కృష్ణశాస్త్రికి దేవుడికి ఏ పువ్వులు కావాలో తెలుసు.

ఏ అలంకారాలు ఏ దేవుడికిష్టమో తెలుసు. ఏ అక్షరాలతో ఏ దేవుని పూజిస్తే అతడు సంతృప్తుడౌతాడో తెలుసు.

''నాకనందన హరి చందనముల కన్న
కరము ప్రియములు చేమంతి విరులు హరికి
ఆరు కాలాలు తిర్నాళ్ళకనుచు వేచి
పూచి యిచ్చును కైంకర్యమునకు వాసి !
హారాలై మెడజుట్టి అందములై అంసాళిపై మెట్టి, లే
తోరాలై చెయిపట్టి యూగు, చనవెంతోగాని శ్రీజానితో
ధారాళమ్ములు క్షీరసాగర సుధా ధమిల్ల మాల్యమ్ములన్
హేరాళమ్ములు పీతి కాపురవనీ హేమంత చేమంతికల్''

పుష్ప సార్థకతను వెల్లడించి భగవంతుని పుష్పాక్షరాలతో పూజించిన పుణ్యమూర్తి. ఇంకా కృష్ణశాస్త్రి వందలాది భక్తి కీర్తనలు రచించారు.

కృష్ణశాస్త్రి గొంతు పోయాక రాసిన గేయ సంకలనం 'కృష్ణరజని' లో ఆర్తి గీతాలు అద్భుతంగా పలికాయి.

''ఎప్పుడైనా ఒక క్షణమైనా
ఏకాంత దర్శనమీవా ? దేవా !

ఎదురుగా నీవూ, నేనే -
ఏకాంత దర్శన మీవా ? ॥ఎప్పుడైనా॥

చిన్న పువ్వు పదములపై ఒకటే,
కన్నీటి చుక్క లాపై రెండే -

బెదరిపోను సుమ, బిడియపడను సుమ -
చెదరకుండ నీ వైపే చూస్తా !
ఎపుడైనా .....

అపుడు వెలిగింతు చిరునవ్వుల
కర్పూర దీప కళిక,

అపుడు వినిపింతు మది నొదిగిన ఒక
అలతి పాట తునక.....
ఎపుడైనా......

ఈ పాటకే బాలాంత్రపు రజనీకాంతరావు సంగీతం కూర్చారు. ఆ విధంగా కూడా 'కృష్ణరజని' సార్థకమైంది.

''ఒదిగిన మనసున పొదిగిన భావము
కదిపే దెవ్వరో ! కదిపే దెవ్వరో !
కదలని తీగకు కరగిన రాగము
కరపే దెవ్వరో! కరపే దెవ్వరో! ॥ ఒదిగిన ॥

కదిపే దెవ్వరో! కరపేదెవ్వరో !
కరగని మనసును, కదలని తీగకు ?
హృదయము రాయిగ గళమున రేయిగ
కదలని దీనుని గతి యిక ఎవ్వరో, ॥ ఒదిగిన ॥

నాకయి ప్రాణము గానము తానయి
నడిపే దెవ్వరో ! నడిపే దెవ్వరో !
కదిపేదెవ్వరో ! కరపేదెవ్వరో?'' ॥ ఒదిగిన ॥

# 5. గద్యంలో చిందిన గంధం

కృష్ణశాస్త్రి పద్యాన్ని, పాటను ఎంత రమణీయ శిల్పరంజితంగా తీర్చి దిద్దారో అంతటి నైపుణ్యాన్ని వచన రచనల్లో కూడా చూపించారు. మంచి గంధంతో మల్లెపూల అత్తరులు కలిపి చినుకుచినుకుగా చిలకరించినట్లుంటుంది ఆయన వచన రచన. గడ్డ కట్టిన లేత జున్ను మీద యాలుకల పొడి అద్దినట్లు ఉంటుంది ఆయన వచన శైలి. పచ్చ కప్పురపు గుభాళింపులో వున్న పాయస పాత్రను నోటికందించినట్టుగా వుంటుంది ఆయన విషయ విన్యాసం. క్షీరసాగర మథనంలో అమృతపాత్ర అందినట్లు ఎవరికీ దొరకని ఏదో ఒక విశేషం ఆయన ప్రతి వ్యాసంలో ప్రత్యక్షమౌతూనే ఉంటుంది.

శాస్త్రిగారి వచన సాహిత్యాన్ని కవి పరంపర, కవితా ప్రశస్తి, మహా వ్యక్తులు, అమూల్యాభిప్రాయాలు అనే నాలుగు భాగాలుగా అచ్చువేశారు. కవి పరంపరలో కృష్ణశాస్త్రిగారు నన్నయభట్టారకుని అమరవాణి, తిక్కన ప్రతిభ, శ్రీనాథుని కవిత, పెద్దన కవి స్వప్న జగత్తు, వేమన, తిరుపతి వేంకట కవులు, పానుగంటి, వేంకట పార్వతీశ్వర కవులు, బసవరాజు అప్పారావు మధురస్మృతి, మల్లవరపు విశ్వేశ్వరరావు 'మధుకీల', రవీంద్రుని కవితా శిల్పం, బర్న్స్ కవి కవితామాధురి, ఎడ్గార్ ఏలన్ పో మొదలైన మహాకవులను గూర్చి చేసిన రేడియో ప్రసంగాలు పొందుపరచారు. కృష్ణశాస్త్రిగారే చెప్పినట్లు ''మామూలు విషయం చెప్పడానికి మామూలు మాటలు చాలును. మామూలు విషయాన్ని మించినదాన్ని వర్ణించడానికి, అసలు భావాలను మించిన అనుభవాన్ని పరమార్థాన్ని చిత్రించడానికి సామాన్య శబ్దాలు ఒక్కొక్కప్పుడు చాలవు''

అందుకే ఆయన వచనాల్లో వాడిన పదాలు కూడా పాఠకుని భావలోకాల్లో విహరింప చేస్తాయి.

నన్నయ, తిక్కనలను గూర్చి చెబుతూ ''నన్నయ ఎక్కువ ప్రాచ్యుడు, తిక్కనకు కొంత పాశ్చాత్య ధోరణి ఉంది. నన్నయ వైకుంఠాన్ని భూలోకంలో అవతరింప చేస్తాడు. తిక్కన భూలోకాన్ని స్వర్గం దగ్గరకు ఎత్తడానికి ప్రయత్నిస్తాడు. ఒకరిది ఎక్కువగా దూరదృష్టి, రెండవ వారిది ఎక్కువగా తీక్ష్ణదృష్టి. ఒకరిది ఎక్కువగా సమ్యగ్ దృష్టి, రెండవవారిది ఎక్కువగా వివేచనాదృష్టి'' అన్నారు. బహుశ ఇంతవరకు ఈ ఇద్దరు మహాకవుల దృష్టిని ఇంత లోతుగా వివేచన చేసినవారు లేరనే చెప్పవచ్చు. నన్నయగారిని గూర్చి చెబుతూ ''నీ అభిమాన కవి ఎవరు ? అని అడిగితే నన్నయ భట్టారకులు అని చెప్పడం, నీ ఆప్తమిత్రులెవరని అడిగితే నా తండ్రిగారు అని చెప్పడం లాంటిదే'' అన్నారు.

అలాగే తిక్కనగారి గురించి చెబుతూ ''తక్కిన ప్రపంచంలో మీ ఇష్టం వచ్చిన భాషలో మొదటి కవిని తీసుకోండి, అతని ప్రక్క నిర్భయంగా కూర్చోబెట్ట దగ్గవాడు'' అన్నారు. నన్నయ, తిక్కనగార్లకు గౌరవస్థానాన్ని ఇవ్వడంలో శాస్త్రిగారి వివేచన సర్వదా ఆమోదయోగ్యమైనది. 'తిక్కన ప్రతిభ' వ్యాసంలో ఆయనను రూపుకట్టి చూపించారు కృష్ణశాస్త్రి. నాకంటికి తిక్కనగారు పొడుగ్గా ఉంటారు. శరీర చ్ఛాయ దబ్బపండులా ఉండొచ్చు. కోటేరు వేసిన ముక్కు, విశాలమైన నుదురు, బలమైన గడ్డం, రాజాస్థానానికి వెళ్ళేటప్పుడు బిళ్ళగోచి పంచె, ముళ్ళఅంగరఖా, శుభ్రసుందరాలైన వస్త్రాలు, నుదుటిమీద గంధాక్షతలు, ఇక అన్నిటికంటె గొప్పవి కళ్ళు. ధగధగ కత్తి మొనల్లా వాడిగా మెరుస్తూ చల్లని అనురాగంతో నిండి వుంటాయి సూర్య చంద్రుల్లాగా'' ఇలా రూపుకట్టి కళ్ళ ముందు పెట్టడంలో ఇంతటి మహాశిల్పి సాహిత్య లోకంలోనే లేరంటే అతిశయోక్తి కాదు. నన్నయ, పెద్దన వ్యక్తిత్వాలను తూచి నన్నయను హరిదాస స్వామితోను, పెద్దనను తాన్‌సేన్ తోనూ పోల్చారు.

వేమన కవిత్వాన్ని గూర్చి చెబుతూ ''వేమన మాట మనికట్టని నిప్పుకణం. తగలగానే చురుకుమంటుంది. వేమన మాట రెక్కముడువని భరత పక్షి, కాలాలు దాటి ఇంకా ఎగిరి వస్తూనే ఉంది'' అన్నారు. ఈ మాటలు, వేమన కవిత లోని వాడిని ప్రతిధ్వనింపజేస్తాయి. వేంకట పార్వతీశ్వర కవులు కవితారీతి చెబుతూ '' ఆవేశం వచ్చినప్పుడు ఒకరి కళ్ళు అగ్నికణాల్లా తళ తళమంటాయి.

రెండవవారి కళ్ళు శ్రావణ మేఘాల్లాగా తడి తడిగా వుంటాయి'' అన్నారు. అలాగే ''ఒక్కొక ఆకే కదిలి, అన్ని ఆకులు కలసి అంతా నిలువునా ఒక పాటయ్యైన రావిచెట్టులాగ ఉండేవాడు బసవరాజు'' అన్నారు.

ఇలా ఒక్కొక్క కవిని గురించి నాలుగు మాటల్లోనే అన్ని భావాలూ స్పష్టమయ్యేటట్లు చెప్పడం కృష్ణశాస్త్రికే తెలుసనిపిస్తుంది.

కృష్ణశాస్త్రిగారి వ్యాస సంకలనంలో రెండవది 'కవితా ప్రశస్తి'. ఇందులో సాహిత్యంలో శబ్దం, కాలజ్ఞానం, కావ్యదృష్టి, కరుణ, కవి-ప్రజా, ప్రాక్పశ్చిమ సమ్మేళనం, మా ప్రణయ లేఖల కథ, ఊర్వశి నా గొప్ప రచనా ?, మహాకావ్యాలు ఎందుకు రావడంలేదంటే, లిరిక్ శిల్పం, అవతారిక, కళ-జీవితము, అభ్యుదయ రచనోద్యమం, ప్రథమ యుద్ధానంతర ప్రపంచ సాహిత్యం అనే వ్యాసాలు పొందు పరచారు. ఇందులో సాహిత్యంలో శబ్దాన్ని గురించి చెబుతూ ''దృష్టిబేధం వల్ల, తన్మయత్వం వల్ల, అనుభవోదాత్తతలవల్ల, సాహిత్యంలో శబ్దం వేరయి పోతుంది, శక్తి అవుతుంది'' అన్నారు. కరుణ అనే వ్యాసంలో ''కన్నీళ్ళలో నుంచి కావ్యం ఎలాగ జన్మించిందో కావ్యం వల్ల కన్నీరూ అలాగే పుడుతుంది'' అని కన్నీటికీ, కావ్యానికి సమన్వయం కూర్చిన తీరు అద్భుతం. 'కళ-జీవితము' అనే వ్యాసంలో ''కవిత్వానికి కూడా పక్షికిలాగే ఆకాశయానం అవసరమే, గూడూ అవసరమే'' అంటారు.

కృష్ణశాస్త్రి వ్యాసావళిలో మూడవ సంపుటం ''మహావ్యక్తులు'' ఇందులో మానవతా మూర్తి వీరేశలింగం, ఆంధ్రదేశము రాజ్యలక్ష్మమ్మగారు, చిలకమర్తి లక్ష్మీ నరసింహం, బ్రహ్మర్షి గురుదేవులు, రవీంద్ర స్మృతి, బ్రహ్మ సమాజ జ్యోతులు, ఉమర్ ఖయ్యామ్, చిత్తరంజన్‌దాస్, ప్రకాశం, కోపల్లె-ముట్నూరి-భోగరాజు అనే వ్యాసాలున్నాయి. ఈ వ్యాసాలలో వీరేశలింగంపంతులు, రఘుపతి వెంకటరత్నం నాయుడు, రాజ్యలక్ష్మమ్మ, చిలకమర్తి మొదలైన సాంఘిక సంస్కర్తలకు నివాళులివ్వడంతోపాటు రవీంద్రుడు ఉమర్‌ఖయ్యామ్ వంటి మహాకవుల స్మృతులు చోటు చేసుకున్నాయి. ప్రకాశం, భోగరాజు వంటి నిస్వార్థ రాజకీయ నాయకులను కూడా స్మరించారు. ఈ వ్యాసాల్లో 'రామమోహన రాయలు అంటే విలియం బెంటిక్ సాయంతో సతీ సహగమనం మాన్పించెను అంటాం, దిక్కుమాలిన టెక్స్ట్ బుక్స్‌లో అంతే వుంది. అది అప్పగించేస్తాం. ఆయన సమగ్ర భారతాభ్యున్నతికి ఏవిధంగా మూల

పురుషుడో, ఆయన ఏలాగున నవ యుగానికి ప్రవక్తో, తొలి విశ్వమానవుడో (యూనివర్సల్ మాన్), ఆయన చూపించిన గమ్యస్థానాన్ని ఇంకా స్పష్టంగా దర్శించలేక లోకం యావత్తు అటు కదలి నడవడానికి గిలగిలలాడుతూ క్రిందా మీదా పడుతూ ఎలాగ ప్రయత్నం చేస్తుందో తెలుసుకోలేము'' అని సంఘ సంస్కరణ పట్ల తనకున్న అభిమానాన్ని ప్రతి అణువున ప్రతిధ్వనింపజేశారు.

ఇక నాలుగవ వ్యాస సంకలనం 'అమూల్యాభిప్రాయాలు'. ఇందులో ఒక కవినిగాని కళాకారుణ్ణే గాని శ్లాఘిస్తూ ఇచ్చే అమూల్యాభిప్రాయాలు, నిజానిజాలు, కవిత్వంలో సొంత గొంతుతో పలికేవాళ్లు - వాళ్ల అనుయాయులు, వక్తకు శ్రోతకు వుండే సంబంధాలు, చిత్రకళలో రస వివేచన అనే సాహిత్య వ్యాసాలతోపాటు ఆకలి, మా వూళ్లో రాగిచెట్లు, ఆటలు పాటలు, పండుగ పాటలు, జోలపాటలు మొదలైన అంశాలను గురించిన అభిప్రాయాలుకూడా ముద్రించారు.

కృష్ణశాస్త్రి సత్యకవి అనడంలో సందేహం లేదు. ప్రాచీన కవుల గురించో, కళాకారుల గురించో, సాహిత్యంలో ఉండే ఇజాల గురించో, భేషజాల గురించో వ్యాసాలు రాసిన వ్యాసకర్తకాదు. ప్రాచీనంలో తనకు నచ్చిన, తాను మెచ్చిన గుణగరిష్టుల నుండి ఎవ్వరికి అందని సత్యాలు బైటపెడతారు. బైట పెట్టడంతో పాటుసమాజంలో మూరు మూల ఎవరికి అందని ఏవేవో రహస్యాలు కళ్ళముందుంచుతారు. అలాంటి రచనల సంకలనాలే 'అప్పుడు పుట్టి వుంటే', 'బహుకాల దర్శనం', 'పుష్పలావికలు' అనే వచన రచనా సంకలనాలు. శాస్త్రిగారు ఆదికవి నన్నయ రచనా వ్యాసంగాన్ని ఎంత నిర్దిష్టంగా చెప్పగలరో రిక్షావాలా, బూట్ పాలిష్, ఊళ్ళో వీధి అరుగులను గురించి కూడా అంత నిశితంగా చెప్పగలరు. వీటిల్లో కొన్ని సంభాషణల రూపంలో కూడా సాగాయి.

కృష్ణశాస్త్రి పుట్టుకతో కవిగా అవతరించినా నిరంతర కవితాధ్యానంలో ద్రష్టగా పరిణతి చెందారు. వచనంలో కూడా తనదైన ఒక శైలిని సృష్టించుకున్నారు. ఆధునిక అవసరాలను ఉటంకిస్తూ రాసిన చిన్న చిన్న వ్యాసాల్లో కూడా తన స్థాయి నుండి దిగిపోకుండా నిలువగలిగారు. అందుకే ఆయన కవిత్వం ఎంతగా హృదయాన్ని ఊపివేస్తుందో ఆయన వచనం కూడా అంతగా ఆలోచనను తట్టి లేపుతుంది.

# 6. కావ్యేషు నాటకమ్ రమ్యమ్

ఒక కవియొక్క పూర్తి ప్రతిభా విశేషాలు అతడు నాటకం రాసినప్పుడే తెలుస్తాయని పెద్దలంటారు. ప్రాచీనంలో కాళిదాసు, భవభూతి వంటి మహా కవులు మహాకావ్యాలను నాటకాలను ఒక్క చేతి మీదుగానే రాశారు కాని ఆధునిక కాలంలో చాలా మంది అలా చేయలేక పోయారు. కృష్ణశాస్త్రిగారు ముందు రోజుల్లో నాటక రచనకుపక్రమించకపోయినా రేడియో కేంద్రంలో కవితాశాఖ కార్యక్రమ నిర్వాహకులైనాక అభిమానుల బలవంతంతోనైనా ఆపని చేయక తప్పలేదు. అలా జరగడం నిజంగా తెలుగు సాహిత్యానికి అదృష్ట రేఖ.

మద్రాసు కేంద్రంలో ఆకాశవాణిలో కృష్ణశాస్త్రిగారు కార్యక్రమ నిర్వాహకులుగా ఉన్న రోజుల్లో ఆచంట జానకిరామ్, బాలాంత్రపు రజనీకాంత రావు, బుచ్చిబాబు, సూరి నారాయణమూర్తి, అయ్యగారి వీరభద్రరావు వంటి సంగీత సాహిత్య సమాశ్రితులు చాలామంది తోడుగా ఉండేవారు. వీరంతా శాస్త్రిగారిని ఎలాగో బ్రతిమాలి కొన్ని రచనలు చేయించారు. అలా వచ్చినవే కృష్ణశాస్త్రిగారి నాటకాలన్నీ. అయితే యివన్నీ ఆకాశవాణి నాటకాలు కావడంతో మామూలు నాటకాలవలె వీటిలో ప్రదర్శనా సౌలభ్యం తక్కువ. అంతే కాని సాహితీ సౌగంధం తక్కువకాదు. కృష్ణశాస్త్రిగారు రాసిన నాటకాలను ధనుర్దాసు, శర్మిష్ఠ పేరుతో రెండు సంపుటాలుగా ప్రచురించారు. ధనుర్దాసు, సాయుజ్యము, గుహుడు, శివక్షేత్రయాత్ర అనే నాటకాలు 'ధనుర్దాసు' అనే సంపుటంలోనూ, శర్మిష్ఠ, కృష్ణాష్టమి, యమునా విహారి, ఏడాది పాడుగునా, గౌతమి, వేణుకుంజం అనే నాటకాలు 'శర్మిష్ఠ' అనే సంపుటంలోను ముద్రించారు. ఈ నాటకాలలో చాలా వరకు సంగీతం ప్రధానంగా సాగినవేనని చెప్పవచ్చు.

ఏ పాట పాడినా గుండె కదిలించే కృష్ణశాస్త్రి రాసిన నాటకాలలో ఏమాట విన్నా హృదయం కరుగుతూనే వుంటుంది. వేణు కుంజం నాటకంలో వీరమ్మ పాత్ర అప్పుడే పూచిన ముద్దబంతి పూవు. వేణుకుంజం చేత పాట పాడించి ఏరుతో కథ చెప్పించి నాటక రచనలో కూడా భావుకత పండించారు. వెంకటేశం కూతురు వీరమ్మ. తల్లి లేని పిల్లని అల్లారు ముద్దుగా పెంచుకున్నారు. కొండయ్య చేలో పని చేసే గోపయ్యతో ఈ గువ్వ కువకువ లాడింది. కళ్ళూ కళ్ళూ కలసి నల్లకలువ మాలలైనాయి. కొండయ్య దొర ఆబోతు. గోపయ్యను పొరుగూరు పంపి వీరమ్మను చెరుస్తాడు. ఆమె చనిపోయింది. వెంకటేశు గుండె కుమిలిపోయింది. ఈ ఘోరం చూసి వేణుకుంజం గుండె బద్దలయింది. ఎన్నాళ్లనుంచో వేణుకుంజంలో కాపురముంటున్న నాగేంద్రుడు కొండయ్యని కాటేస్తాడు.

వెదురు కణుపు కణుపు వెక్కి వెక్కి ఏడ్చింది. పొదను చూసి ఏరు కరిగి పోయి మరీ ఏడ్చింది. పొదలు ఏడ్చాయి. తోపు వెనకాల గుడిలో వీరమ్మ పేరంటాలు కాలువయ్యింది. కన్నె పిల్లల్ని కాపాడుతుంది.

'కృష్ణాష్టమి' నాటకంలో సూర్యోదయం లాగ 'కృష్ణోదయ' సమయం. అక్కడ మధురలో వసుదేవుడు - దేవకీ, ఇక్కడ గోకులంలో యశోద-నందుడు మధ్య పవిత్ర ప్రేమమూర్తి మురళీ బాంధవి రాధ. రాధ సంగీత లహరితో మాధవుని జననం ముడిబెట్టి, కన్న బిడ్డల్ని త్యాగం చేసిన దేవకి - యశోదలను చూపిస్తూ ఈ సంగీత నాటకం సాగిస్తారు కృష్ణశాస్త్రి. ఈ నాటకంలోని ఒక్కొక్క పాట ఒక్కొక్క పండిన భావగీతం. రాధ పాట ఒకటి ఉదాహరణగా చెబుతాను.

''చేయబోనని తలుపు !
తీయమంటూ పిలుపు !

రాధకెందుకో నవ్వుగొలుపు !
నీలోన నాలోన
నిదురపోయే వలపు

మేలుకుంటే లేదు తలుపు.
విశ్వమంతా ప్రాణ
విభుని మందిరమైన

వీథివాకిలి ఏది చెల్లెలా,
విశ్వవిభుడే రాధ
వెంటనంటి రాగ
పిలుపేది తలుపేది చెల్లెలా.''

అలాగే యశోదతో అంటుంది.

''ఏ పాల కడలి నీలో పొంగునో కాని
తడియునీ తెలిరైక
తడియునీ వెలిపైట''

ఈ మాటలో శృంగారాంతర్భూతమైన వేదాంతం ఎంత సొగసుగా చెప్పబడిందో.

కృష్ణశాస్త్రిగారి అన్వేషణలో చెప్పబడిన ఇతివృత్తమే 'యమునా విహారి' నాటకంలో కూడా నడచింది.

సంభాషణ కూడా గేయంగా సాగడం ఇందులో ప్రత్యేకత. మచ్చుకి....

''ఆడగొంతు-1 : ఏవయ్యా పిల్చేరు ?
ఆడగొంతు-2 : ఇటు గుండెలు కలచేరు ?
అందరూ : బృందలోన మందలోన మారుతములు తరలు మందానిలయములను యమున అందె రవళి పొరలు''

అలా సాగిపోతుంది. వేణువు విని విరహంతో యమునా తీరంలో సాగిన గోపికల అన్వేషణ ఇందులో ప్రధాన కథాంశం.

ఇందులోని పాటలు మనోహర పూల మాలికలు. ఈ పాట చూడండి.

''రెల్లు పూలా పానుపు పైనా
జల్లు జల్లులుగా - ఎవరో
చల్లీనారమ్మా - వెన్నెల చల్లీనారమ్మా ॥చల్లీనారమ్మా॥

కరిగే పాల కడవలపైన
నురుగు నురుగులుగా -
నురుగే రాధా మనసూ పైనా
తరకా తరకలుగా ఎవరూ
పరచీ నారమ్మా. వెన్నెల పరచీనారమ్మా.

కడిమి తోపుల నడిమి చారుల
ఇసుక బైళుల మిసిమిదారుల
రాసీ రాశులుగా - ఎవరో
పోసీనారమ్మా. వెన్నెల పోసీనారమ్మా.''

''శర్మిష్ఠ'' నాటకంలో రాజుగారి కుమార్తె ప్రణయగీత లాస్యం బాగా పండించారు. దేవయాని తన జీవితంలో పూర్వ వసంతాన్ని తలచుకొని పలవరించి వర్తమానంలోని యయాతి వార్ధక్యంతో జీవితాన్ని పంచుకోలేకపోతుంది. శర్మిష్ఠ ఆ భాగ్యానికి సంతోషిస్తోంది. ఈ మధ్య యువతకు వార్ధక్యానికి సంఘర్షణ.

తాత అంటాడు, ''వెదుళ్లవన్నీ వేణువులైతే
కుంజాలన్నీ గొంతుకలైతే
పందిళ్లకు మరిపాకలకూ
వాసాలో, రాటాలో.''

యువతి అంటుంది, ''వసనాలన్నీ మసనాలైతే
తరుణులందరూ తాతలె అయితే
ఆటలకు పాటలకు
చోటేది ? తోటేది ?

మహారాజు శర్మిష్ఠ మధ్య ప్రేమించకుండా ఉండలేని స్థితిలో శిథిలంలో చైతన్యాన్ని సృష్టించి వారిచేత పాడించారు.

''ఏ చోట దాచితివో, ఈ చైత్ర జీవమ్ము
ఇన్నాళ్లు మాకనుచు దేవా.

ఈ చీకు హృదయాలు వేచి కననే లేవు
నీ చిత్రములు దేవ దేవా.

ఇక హిమర్తువు వలదు. ఇక నిశీథము వలదు
నీ సన్నిధియే దేవ దేవా.

ఒక వసంతము పైన ఒక ప్రభాతము లోన
వికసింప జేయవా దేవా.''

ఈపాటలో చైతన్య శిఖరాల మాటున ఆర్తభక్తిని అమోఘంగా పండించారు.

''గౌతమి'' నాటకం నాట్యం ప్రధానంగా నడిచిన ఒక పల్లెటూరి సాంఘిక ఇతివృత్తం. ఇందులో గౌతమి జలప్రళయం గీతంలో వర్ణించారు కృష్ణశాస్త్రి.

''శబరియూ మంజీర కిన్నెర
చేతులూ చేతులూ కలిసాయ్
జెబ్బలు జెబ్బలూ కలిసాయ్
లోతులన్నియూ నిండాయ్
గౌతమి పొంగీ పొర్లింది.

జల ప్రళయం జల ప్రళయం,
వరదలూ వరదల్లు వరదలు!

సుళ్లు బడి పరవళ్లనిడి - పరు
గుల్ల వడి, ఉరుముల్ల సడి - నుర
గల్లు గ్రక్కింది - అదిగో
పుల్ల తొక్కింది - అరరె
గట్ల నొక్కింది''

భాషాయోష ఆయన చూపుకే వంగి సలాములు పెడుతుంది. కోరకుండానే కుండ పోతగా పద ప్రసూనాలను కుమ్మరిస్తుంది..

కృష్ణశాస్త్రిగారి ఒక్కొక్క నాటకం ఒక్కొక్క మహాకావ్యం. ఒక సంగీత స్రవంతి. 'శర్మిష్ఠ' నాటకంలో రాచవారింటి ప్రణయగీత విలాసం, 'గుహుడు' లో పడవవాడి భక్తి పారవశ్యం, 'వేణుకుంజం' - 'ఏడాది పొడుగునా' నాటకాల్లో తెలుగు పల్లె జీవనం, 'కృష్ణాష్టమి' - 'యమునా విహారి' - 'గౌతమి' నాటకాల్లో ప్రణయ తత్వం, 'ధనుర్దాసు' లో ప్రేమ, సాయుజ్యము 'శివక్షేత్ర యాత్రలో' భక్తి తత్వం కవితామయమై ప్రవహించాయి. ఈయన రాసిన నాటకాలన్నీపద్య గేయాలతో పార్లి పోతుంటాయి. పద్యం గేయంలా సాగిపోతుంది. గేయం పద్యమంత గంభీర్యమై ఉంటుంది. మధ్యలో వచ్చే వచనం ఈరెంటిని కలుపుకుపోతుంది. ఈ పాట కృష్ణశాస్త్రిది. ఈపద్యం కృష్ణశాస్త్రిది అనిపించినట్లే, ఈ మాట కృష్ణశాస్త్రిది అనిపిస్తుంది. అలాగే ఈ గాథ కూడా కృష్ణశాస్త్రిదే ననిపిస్తుంది. ఆయన ఏ కథను చెప్పినా తీయని కలల్లా, సెలయేటి అలల్లా గలగల పారుతూ అర్ధగంటలో హృదయాన్ని స్వర్గధామంగా మార్చి ముగిసే ఈ నాటకాలు రసావిష్కరణ చేయడంలో రవ్వల హారాలు.

# 7. అక్షయ కృతులు ఆయన యక్షగానాలు

''కీర్తింతు రెడ్డాని కీర్తి గంధర్వులు
గాంధర్వమున యక్షగాన సరణి'' అన్నాడు శ్రీనాథుడు.

ఎటూ కృష్ణశాస్త్రిగారు ''నా నివాసంబు తొలుత గంధర్వ లోక మధుర సుషమా సుధాగాన మంజువాణి'' అన్నవారే గనుక ఆయన రచించిన యక్షగానాలు కూచిపూడి చరిత్రలో పెద్ద మలుపు తెచ్చాయనడంలో ఆశ్చర్యంలేదు. ఈ యక్షగాన రచనకు సూత్రధారుడు బాలాంత్రపు రజనీకాంతరావు. కృష్ణశాస్త్రిగారు, రజనీ మద్రాసు ఆకాశవాణిలో పని చేస్తున్న రోజుల్లో వీరిద్దరి నిర్వహణలో కాటూరి వేంకటేశ్వరరావు గారి చేత ''శ్రీనివాస కళ్యాణం'' అనే యక్షగానం రాయించి ప్రసారం చేశారు. ఆతరువాత వీరిద్దరూ విడిపోయి తిరిగి 1960లో హైదరాబాద్ ఆకాశవాణిలో కలసి పని చేశారు. ఆ సమయంలో శాస్త్రిగారు ''రజనీ ! కాటూరి బావగారిచేత వ్రాయించినట్లు నా చేత గూడ ఒక యక్షగానం వ్రాయించు, అనువైన శీర్షిక చెప్పి షెడ్యూల్ చేసుకో'' అన్నారు. ఇక్కడ శాస్త్రిగారికి తనకై తానే యక్షగాన రచన చేయాలనే కోరిక కలగడం విశేషం. రజనీ గారు అసలు నాటక రంగ చరిత్రలోనే తొలి ప్రదర్శనగా భరతుని నాట్యశాస్త్రంలో తొలి ప్రకరణంలో చెప్పబడిన 'క్షీరసాగర మథనం' అనే ఇతివృత్తాన్ని యక్షగానంగా రాయమని కోరారు. అదే కృష్ణశాస్త్రిగారి తొలి యక్షగానం.

ప్రసారం తేదీ దగ్గర పడుతున్నా శాస్త్రిగారు క్షీరసాగరంలో కనీసం సిరాచుక్కయినా వేయలేదు. ఇంతకు ముందు నాటకాల్లో, సంగీత నాటకాల్లో

ఆయనకున్న స్వేచ్ఛ యక్షగానాల్లో దొరకదు. అందుకే ఆవేశం కలుగలేదు. రజనీ ఎన్ని విధాల ప్రయత్నించినా కార్యం గట్టెక్కలేదు. లాభం లేదని ఒక రాత్రి శాస్త్రిగారి దగ్గరకు వెళ్లి కూర్చున్నారు రజని. అంతే కృష్ణశాస్త్రిలోని కవి మేల్కొన్నాడు.

''శ్రీ కృష్ణ దాస చకోర......'' అని ఎత్తుకొని
''పూర్ణిమా రజనీ కాంతోదయ దయా రాశి హెచ్చరికా,
అంబా హెచ్చరికా
అపర్ణా హెచ్చరికా,
సాంబశివుని ప్రేమదాసి హెచ్చరికా'' అనే పాట పూర్తి

చేశారు. కృష్ణశాస్త్రిగారు కన్ను తెరచి కలం పడితే ''నన్నెవ్వరాపరీవేళ'' అంటారు.

సహజంగా యక్షగానాల్లో చూర్ణికలు, దరువులు, కవితాత్మక వచనాలు ఉంటాయి. అయితే మామూలు నాటకాల్లో లాగ కాకుండా యక్షగానాల్లో స్వీకరించే సన్నివేశాలు నాట్యానికి అనుకూలంగా హావభావ విన్యాసాలకు దగ్గరగా ఉండాలి. రాసే చూర్ణికల్లో, దరువుల్లో కందార్థాల్లో అడుగుల లయ అంతర్లీనంగా ఇమిడి మృదంగ వాద్యంతో ధీటుగా పలకాలి. కొన్ని సన్నివేశాలు సామూహిక నాట్యానికి అనుకూలంగా మలుచుకోవాలి. అంతేగాక ఒక్కొక్క సందర్భాన్ని బట్టి ఫలానా ఛందంలో ఉండాలని, ఫలానా రాగంలో ఉండాలని కొన్ని నియమాలు యక్షగానాల్లో సంప్రదాయంగా వస్తున్నాయి. అవి తప్పితే నాట్యాచార్యులు అంగీకరించరు.

ఇన్ని నియమాలు అనుసరిస్తూ కూడా శాస్త్రిగారు నూతన రీతులు ప్రవేశ పెట్టడానికి ప్రయత్నించారు. ఉదాహరణకు బలిచక్రవర్తి కొలువు తీరుతున్నాడనుకోండి. ''రాజు వెడలె సభకు.......'' అని పూర్వీకులు ప్రారంభించేవారు. కాని కృష్ణశాస్త్రిగారు ''కొలువు తీరె అసుర చక్రవర్తి బలి...విమల కీర్తి'' అని ప్రారంభించారు. అలాగే క్షీరసాగర మథనంలో రాక్షసులు బౌద్ధత్వంతో మేము తలవైపే పట్టుకుంటామనే మాటను

''మాకేల అశోక
ఆహిఫణావళులు గైకోక'' అంటారు.

సురాసురులు క్షీరసాగరాన్ని మధించే ఘట్టంలో

'తరవండీ క్షీరాబ్ధిని'' అనే పల్లవిని చాలాసేపు పాడిస్తూ ఒక్కొక్క చిన్న చిన్న పద్యంలో మధ్య మధ్య శంఖం, చక్రం, ఐరావతం, ఉచ్చైశ్రవం లక్ష్మీదేవి రావడాన్ని చెప్పడం మంచి ప్రయోగం. ఆకాశవాణిలో ఈ యక్షగానం విన్న తరువాత ప్రముఖ నాట్యాచార్యులు చింతా కృష్ణమూర్తి, వేదాంతం సత్యనారాయణ, వెంపటి సత్యం, చినసత్యం, అలాగే రంగస్థల నటులు బందా కనక లింగేశ్వరరావు మొదలైన వారంతా కూడా కూచిపూడి శైలిలో ఈ రూపకాన్ని రంగస్థలంపైకి చేర్చారు.

క్షీరసాగర మథనానికి వచ్చిన ప్రశంసలు విన్నాక కృష్ణశాస్త్రిగారికి 'విప్రనారాయణ' యక్షగానం రాయాలనే సంకల్పం కలిగింది.

విజయవాడ ఆకాశవాణివారి ఆహ్వానంపై విజయవాడకు వచ్చి ఈ రూపకాన్ని పూర్తి చేశారు. ఈ రచనలోకూడ రజనీ, చింతా కృష్ణమూర్తి, ఓలేటి వెంకటేశ్వర్లు గార్లు సహాయకులుగా పనిచేశారు.

రంగనాథస్వామి సన్నిధిలో పాడే ''కొలువైతివా రంగశాయి...'' అనే దరువు కూచిపూడి వారికి వరమైంది. అలాగే

''చేకొనవయ్యా రంగయ్యా....'' అనే విప్రనారాయణ గీతం,

''ఏమి మాటలే సరి సరి
ఎవరే ఈ దాసరి'' ...అనే దేవ దేవి గీతం

కూచిపూడి వారికి అత్యంత ప్రియమైనవిగా మారిపోయాయి.

ఈ యక్షగానం కూడా విజయవంతం కావడంతో రజనీ గారి బలవంతంమీద మరో యక్షగాన రచనకు ముందుకొచ్చారు. ఇక్కడ నృత్య ప్రదర్శనలో పోటీ ప్రధానంగా నడిచే కాళిదాసు 'మాళవికాగ్నిమిత్రం' ఇతివృత్తంగా స్వీకరించారు.

''మాళవికాగ్నిమిత్రం'లో ఆస్థాన నాట్య గురువులైన హరిదాస గుణదాసుల మధ్య పోటీ, మాళవిక ఆ పోటీకి దృష్టాంత పూర్వకమైన నాట్యాన్ని రాజసభలో ప్రదర్శించడం, రాజు ఆమె పరస్పరాకర్షితులు కావడం మొదలైన

మధుర సన్నివేశాల్లో కాళిదాసు శ్లోకాలు శాస్త్రిగారి చేతిలో దరువులుగా మారి పోయాయి.

> ''రంగ సీమ నిలిచెను లేమా
> అభినవ లావణ్యధామా''          అనే దరువూ,
>
> ''మరచేదగునా....మదనా !
> నీ విరిశరములు దయవలన
> ఆ ల ల న...... !          అనే దరువూ అలాంటివే.

భావయుక్తమైన ఈ గీతాలు నాట్య రంగానికే మణి దీపాలు. అయినా ఈ యక్షగానం ఇంకా ఎక్కువ ప్రదర్శనలు పొందలేదు.

సంప్రదాయక రాగాల ప్రయోగంలోను, దరువులు లయలు సృష్టించడంలోను, అతీత అనాగతాల స్ఫురణలోను, రసానుసరణలో పాత్రకు సముచితమైన కాకు స్వరాల ప్రయోగంలోను కృష్ణశాస్త్రిగారు అద్భుతమైన మెళుకువలు ప్రదర్శించి యక్షగాన రచనలో విజయవంతమైనారు.

# 8. కదిలే బొమ్మకు కావ్య గౌరవం

కృష్ణశాస్త్రి పుట్టడమే పాటల కవిగా పుట్టారు. ఈయన కవిత్వంలో ప్రధాన గుణం భావమైతే మరో గుణం సంగీతం అంతర్వాహినిలా సాగడం. అందుకే ఆకాశవాణితోపాటు చలన చిత్ర పరిశ్రమ కూడా ఆయన్ని ఆహ్వానించింది. సహజంగా సినిమా సన్నివేశాలకు అనుకూలంగా పాట వ్రాయడం- ఆ సినిమా ప్రభావం తగ్గిపోగానే ఆ పాట మరుగున పడి పోవడం చూస్తుంటాం. సినిమా కోసమే రాసినా కలకాలం జీవించి, సినిమా మరుగైనా పాట నిలిచే ఉండేవి ఎక్కడో కొన్ని పాటలు కనిపిస్తాయి. అటువంటి మంచి పాటలు రాసిన కవుల్లో దేవులపల్లి అద్వితీయులు.

1939 నాటికే ఆయన పాటలు ప్రతి నాగరికుడి నోటికి కూని రాగాలయ్యాయి. ఆనాడు రాసిన గీతాల్లో

''మధూదయంలో- మంచి ముహూర్తం
మాధవిలతకు పెండ్లి...
మాధవి పెండ్లికి మల్లెమాలలు
మందారం పేరంటాళ్లూ ||మధూదయంలో||

కొమ్మ కొమ్మకొక సన్నాయీ
రెమ్మ రెమ్మకొక గవ్వాయీ
కొమ్మా రెమ్మా కలిసీ మామిడి
గుబురంతా ఒకటే హోయీ..... ||మధూదయంలో||

ఆకసమంతా పందిరి అయితే
మధువనమంతా మండపమైతే
మాధవదేవుడు మాధవీలతకు
మంగళసూత్రం కడతాడూ....
మధూదయంలో మంచి ముహూర్తం
మాధవి లతకు పెళ్లి.... ॥మధూదయంలో॥

అనే పాట బ్రహ్మాండమైన ప్రచారంలో ఉండేది. ఇంతటి పదచిత్రాలు చూసిన సినిమా రంగం 1951లో తన ప్రపంచంలోకి ఆహ్వానించింది.

కృష్ణశాస్త్రి పాటలు రాసిన మొదటి చిత్రం 'మల్లీశ్వరి'. ఈ సినిమాలో కృష్ణశాస్త్రి రాతలకు పాటకట్టింది సాలూరి రాజేశ్వరరావు. పాడిన కోయిల భానుమతి, గొంతు కలిపిన గువ్వ ఘంటసాల. కృష్ణశాస్త్రి పాటలతో మల్లీశ్వరి సినిమా తెలుగు సినిమారంగ చరిత్రలో అసామాన్య భావ కావ్యంగా భాసిల్లింది.

''మనసున మల్లెల మాల లూగెనే
కన్నుల వెన్నెల డోల లూగెనే
ఎంత హాయి ఈ రేయి నిండెనో
ఎన్ని నాళ్లకీ బ్రతుకు పండెనో ॥మనసున॥

కొమ్మల గువ్వలు గుస గుస మనిన
రెమ్మల గాలులు ఉసురుసు రనిన
అలలు కొలనులో గలగల మనినా
దవ్వుల వేణువు సవ్వడి వినినా
నీవు వచ్చేవని నీ పిలుపే విని
కన్నుల నీరిడి కలయ జూచితిని...
గడియేయేని యిక విడిచి పోకుమా
ఎగసిన హృదయము పగుల నీకుమా ॥మనసున॥

రాణివాసపు పంజరంలో బంధీయైన మల్లీశ్వరి రాత్రిపూట రహస్యంగా ప్రియుని కలుసుకున్నపుడు ఆమె మనసున మల్లెలు ఊగిపోయాయి. హాయి నిండిన ఆ రేయిలో ఆమె బ్రతుకే పండింది.

ఆయన సంతోషాన్ని వ్యక్తపరచినా, సందేశాన్ని పంపించినా ప్రతి పాటా

ఒక మధుర కావ్యం. కాళిదాసు మేఘ సందేశాన్ని దృష్టిలో ఉంచుకొని మల్లీశ్వరిలో మంచి పాట రాశారు. అలాగే జావళీలు రాయడంలో కూడా ఆయనకు తిరుగులేదు.

''పిలిచిన బిగువటరా......
పిలిచినా బిగువటరా...... ఔరౌర !
పిలిచినా బిగువటరా....
చెలువలు తామే
వలచి వచ్చినా ॥పిలిచినా॥

భళిరా....రాజా
ఈ నయగారము
ఈ వయ్యారము
ఈ నవయవ్వన మానగ నినునే ॥పిలిచినా॥

గాలుల తేలెను
గాటపు మమతలు
నీలపు మబ్బుల
నీడలు కదలెను

అందెలరవళులు
సందడి మరి మరి
అందగాడ యిటు
తొందర సేయగ ॥పిలిచినా॥

నలభై సంవత్సరాలు గడిచిన తరువాత ఎన్నోరకాల జావళీలు తెలుగు సినిమా లోకంలో కొచ్చినా ఈ పాట నిత్య నూతనంగా అందరి హృదయాలనూ అలరిస్తూనే వుంది.

పాటలో జీవిత చిత్రాన్ని చిత్రించడంలో ఆయన కాయనే సాటి. జీవితంలో అన్నివిధాల ఓడిపోయినవాడుగా మారిపోయిన ఉక్కుమనిషిలో పరివర్తనకు కారణమైంది ఒక పసిపాప. తరువాత అతడు పాప కోసమే జీవిస్తాడు.

కారణాంతరాన చెరసాలకు వెళ్లి తిరిగి వచ్చాక పాప పెద్దదవుతుంది. అతన్ని మరిచిపోతుంది. బరువెక్కిన గుండెలతో ఒక పాప బొమ్మను లాలిస్తూ

తాధిమి తకధిమి తోల్‌బొమ్మ
దీని తమాస చూడవే కీల్‌బొమ్మ
దీని తమాస చూడవే మాయబొమ్మ ॥తా॥

ఆటమ్మా...పాటమ్మా
జగమంతా బొమ్మలాటమ్మా
తళాంగు తకధిమి తోల్‌బొమ్మ
తోం తకతై తకతై మాయబొమ్మ ॥తా॥

నాలుగు దిక్కుల నడిమి సంతలో
తూలే తుళ్ళే తోల్‌బొమ్మ
తూలే తుళ్ళే కీల్‌బొమ్మ
ఎవ్వరికెవ్వరో ఏమౌతారో
ఇవరం తెలుసా కీల్‌బొమ్మా ఈ
ఇవరం తెలుసా మాయబొమ్మ ॥తా॥

కోపం తాపం క్రూర కర్మలూ
కూడని పనులే తోల్‌బొమ్మా
కూడని పనులే కీల్‌బొమ్మా
పాపపు రొంపిని పడబోకే
పరమాత్ముని నమ్మవె కీల్‌బొమ్మ
ఆటమ్మా....పాటమ్మా.....
పరమాత్ముని బొమ్మలాటమ్మా ॥తా॥

(బంగారుపాప)

అనే పాట పాడతాడు. తలచుకుంటేనే గుండె కరిగిపోయే ఈ సన్నివేశంలో తత్త్వాన్ని ఎంత గొప్పగా పలికారు కృష్ణశాస్త్రి.

శాస్త్రిగారు మల్లెల్లో పూలల్లో కూడా సృష్టి విలాసాన్ని పొదిగి చెప్పిన పాటలు లెక్కకందవు.

''ఇది మల్లెల వేళయని
ఇది వెన్నెల మాసమని
తొందరపడి ఒక కోయిల

ముందే కూసింది
విందులు చేసింది ॥ఇది మల్లెల॥

కసిరే ఎండలు కాల్చునని
ముసిరే వానలు ముంచునని

ఎరుగని కోయిల ఎగిరింది
విరిగిన రెక్కల ఒరిగింది ॥ఇది మల్లెల॥

అని మల్లెలు, వెన్నెల, కోయిలతో మహత్తరమైన జీవిత సత్యాన్ని పాడారు కృష్ణశాస్త్రి. అందులోనే అంటారు

''మరిగి పోయేది మానవ హృదయం
కరుణ కలిగేది చల్లని దైవం
వాడే లతకు ఎదురై వచ్చు
వాడని వసంత మాసం
పసివాడని కుసుమ విలాసం ॥ఇది మల్లెల॥

ద్వారానికి తారామణి హారం
హారతి వెన్నెల కర్పూరం
మోసం ద్వేషం లేని సీమలో
మొగసాల నిలిచెనీ మందారం ॥ఇది మల్లెల॥

విషాదం వెనుక వసంతాన్ని సృష్టించి ఊపిరి పోస్తారు కృష్ణశాస్త్రి. సినిమాల్లో కూడా ఎన్నో భక్తి గీతాలు రాశారు. ఆయన భక్తి గీతాల్లో కూడా భావనా ముద్ర ఉట్టి పడుతుంది.

''సంపూర్ణరామాయణం''లో శబరి రామునికోసం ఎదురు చూస్తుంది. రాముడు సమీపానికి వస్తున్నాడు.

''ఊరికే కొలను నీరు ఉలికి ఉలికి పడుతున్నది
ఓరగా నెమలి పింఛ మారవేసుకుంటున్నది
ఎందుకో ప్రతి పులుగూ ఏదో చెప్పబోతుంది
వనములో చెట్టు చెట్టు కనులు విచ్చి చూస్తుంది
ఉండుండీ నాఒళ్లు ఊగి ఊగి పోతుంది
అడుగో రామయ్యా, ఆ అడుగులు నా తండ్రివే.

ఇదిగో శబరీ, శబరీ, వస్తున్నానంటున్నవి.
కదలలేదు వెర్రి శబరి ఎదురు చూడలేదని

నా కోసమే, నాకోసమే నడచి నడచి నడచి
నాకన్నా నిరుపేద నా మహారాజు - పాపం
తీరా దయజేసిన నీ రూపు తోచదయ్యయ్యో.

ఏలాగో రామా...ఏదీ, ఏదీ, ఏదీ.....
కొలను నడిగి తేటనీరు
కొమ్మ నడిగి పూలచేరు
చెట్టు నడిగి పుట్టనడిగి పట్టుకొచ్చిన ఫలాలు
పుట్టతేనె రాసాలు ॥

దోరవేవో - కాయవేవో అరమగ్గిన వేవో
ముందుగా రవంత చూసి
విందుగా అందియ్యనా ॥

ఈ పాట వింటే శబరికి, శాస్త్రిగారికి భేదం లేదు. ఎన్నాళ్లుగా ఎదురు చూస్తున్న శబరియో శాస్త్రిగారి అంతరాత్మ. భగవంతుని ముందు కృష్ణశాస్త్రి తానే రాధిక కదా.

''ముందు తెలిసెనా, ప్రభూ ! ఈ
మందిర మిటులుంచేనా ?
మంద మతిని, నీవు వచ్చు

మధుర క్షణమేదో, కాస్త
ముందు తెలిసెనా....

అందముగా, నీ కనులకు
విందులుగా వాకిటనే

సుందర మందార కుంద
సుమ దళములు పరవనా ?
ముందు తెలిసెనా......

బ్రతుకంతా ఎదురు చూచు
పట్టున రానే రావు.....

ఎదురరయని వేళ వచ్చి
ఇట్టె మాయమౌతావు !
ముందు తెలిసినా.....

కదలనీక కృష్ణ రజని
గడచుదాక నిలువగ నీ
పదముల నా హృదయము
బంధింపగలేను సంకెలగా !
ముందు తెలిసినా .....

(మేఘ సందేశం)

గళం మూగబోయాక ఈ పాట రాసినా గగన తలాన్ని స్పృశిస్తుంది. భగవంతుని పిలుస్తుంది.

ఇంకా భాగ్యరేఖ సినిమాలో ''నీవుండేదాకొండాపై'', రాజమకుటం సినిమాలో ''సడిసేయకేగాలి'', భక్తశబరి చిత్రంలోని ''ఏమిరామకథ'' మంచిరోజులొచ్చాయిచిత్రంలోని ''నేలతోనీడఅన్నది నమతాకరాదని'', అమెరికా అమ్మాయిలో ''పాడనాతెలుగు పాట'', బంగారు పంజరంలో ''గట్టుకాడ ఎవరో !'' మొదలైన పాటలు ఆయన రాసిన పాటల్లో

ఆణిముత్యాలుగా చెప్పవచ్చు. ఆయన పాటలు 'మేఘమాల' అనే సంపుటంగా వెలువడ్డాయి.

కృష్ణశాస్త్రి వందల సినిమాల్లో దాదాపు 500పైగా పాటలు రాశారు, ఒక దశాబ్దం ఇవతల వాళ్లకు కృష్ణశాస్త్రి సినిమా కవిగానే పరిచయం. ఏమైనా సినిమా పాటకు కావ్య గౌరవాన్ని కల్పించిన ఘనత కృష్ణశాస్త్రికే దక్కుతుంది.

# 9. వసంతంలో వేగు చుక్క పొడిచింది

కృష్ణశాస్త్రిగారు నిరంతర ఆత్మాశ్రయ భావ కవితా యోగి అయినా సామాన్యుని గుండె తట్టి అతని కర్తవ్యాన్ని గుర్తు చేయడంలోను అతని క్రియా శీల శక్తిని ఉత్తేజపరచడంలోను ఎక్కడా వెనుకాడలేదు. కవిగా తన వంతు కర్తవ్యాన్ని తాను నిర్వహిస్తూనే ఉన్నారు. కృష్ణశాస్త్రి తాను భావ కవిత్వ ప్రతినిధిగా నిలబడినా మొదటి నుంచి తాను అభ్యుదయాన్ని కాంక్షిస్తూనే ఉన్నారు. రఘుపతి వెంకటరత్నం నాయుడుగారి శిష్యరికంలోనే కుల మతాలకు వ్యతిరేక దృక్పథం ఏర్పరచుకున్న కృష్ణశాస్త్రి అనంతర కాలంలో అభ్యుదయ భావాలను గౌరవించడంలో ఆశ్చర్యం లేదు.

కాలంతో కదలి రావడం, అభ్యుదయాన్ని మనసారా ఆహ్వానించడం అచ్చమైన కవిగా ఆయనలోని క్రమానుగత పరిణామం. అంతేకాదు 'శ్రీశ్రీని ప్రేమించినవాడు. శ్రీశ్రీ మనస్సుమీద చెరగని ముద్ర వేసినవాడు'. ఆ విషయమే చెబుతూ శ్రీశ్రీ

> ''ఒకదానిలో కృష్ణశాస్త్రిగారు నామీద ఇలా రాశారు.
> శ్రీశ్రీ గొప్ప కవి. అతని మీద ఈగవాలినా నేను సహించలేను'' అని

నామీద వారికెప్పుడూ సదభిప్రాయమే ఉంది. వారిమీద నాకు వల్లమాలినంత అభిమానం. నా మనస్సు మీద చెరగని ముద్రవేసిన ముఖ్యాతి ముఖ్యులలో కృష్ణశాస్త్రిని ప్రముఖంగా పేర్కొంటాను'' అన్నారు.

ఆయనలోని క్రమ పరిణతికి చిహ్నంగా

''శీతవేశ రానీయకు
శిశిరానికి చోటీయకు'' వంటి గేయాలు స్వీకరించ వచ్చు. మొదట కృష్ణశాస్త్రి స్వాతంత్ర్యకాంక్షతో జాతీయగీతాలు పాడారు.

''హే భారత జనని
స్వేచ్ఛా గగన వీధి విహారిణి
స్వతంత్ర స్వర్ణారుణ
కంకణ కటక కలాపినీ'' అని భరత మాతకు జేజేలు పలికి

''జయ జయ జయ ప్రియ భారత జనయిత్రీ దివ్యధాత్రి''అంటూ నివాళు లర్పించారు.

స్వతంత్ర్యోద్యమంలో ప్రజలను కదలిస్తూ రాసిన ఈ గీతం

''ప్రజా రథం తరలింది
ప్రపంచ పథం పారలింది
కనుక పదవోయి పద''

అంటూ హెచ్చరిస్తూ ఉత్తేజితుల్ని చేసింది. 1939 ప్రాంతంలో దేశంలో క్షామ దేవత తాండవిస్తున్న తరుణంలో 'ఆకలి' గేయం రాశారు.

''కాలదేవత గుండె ఒరిసి
కాళరాతిరి నెత్రు కురిసి
రాకాసి మెలుగు
చీకట్లు మూలుగు
.................
కాళరాతిరి గుండె పగిలి
కాలసర్పము విషము రగిలి
రాకాసి మెలుగు
చీకట్లు మూలుగు''

ఈ గేయం ఆనాటి యువతకు నిప్పు కణం.

అనంతరం అంతర్జాతీయ దృక్పథం ఆయన మదిలో చోటుచేసుకుంది. 1941లో స్టూడెంట్స్ ఫెడరేషన్ ఆధ్వర్యంలో జరిగిన విద్యార్థి మహాసభకు అప్పటి విద్యార్థి నాయకుడు పి.యన్. శర్మ కోరిక మీద ఉద్యమానికి ప్రేరణగా ఆవేశం అంతరూభ్హతంగా ఒక ప్రబోధ గీతాన్ని రచించారు కృష్ణశాస్త్రి. ఆ గీతం ఆనాటి ఉద్యమ కార్యకర్తలకు ఎంతో ఉద్దీపన కలుగ జేసిందని ప్రత్యక్ష సాక్షులు అవంత్స సోమసుందర్ చెప్పారు.

''ఆకాశము నొసట పొడుచు
అరుణారుణ తార
ఏకాకి నిశీథి నొడుచు
తరుణ కాంత ధార ॥ఆకాశము॥

జయ పతాక యువ పతాక
వియదాపగ వెడలు నౌక
యుగ యుగాల పీడకలలు
సాగయ చేయు సంకెలలు
తెగనివి కావోయి మ్రోల
ధగధగా స్వతంత్ర
విభాతాకాశము నొసట
పొడుచు అరుణారుణ తార. ॥ఆకాశము॥

అంతు లేని ద్వేషము
ఏరోషము స్వార్థము మోసము
పంతగించి నిలువవు
అవంత యేని శాంత విభాత
ఆకాశము నొసట పొడుచు
అరుణారుణ తార. ॥ఆకాశము॥

ముందు కలదు మన జాతికి
ముక్తి, అమరజీవ రక్తి
క్రిందు వెనుక గనక
నడుపు ఢ్కందరు అభ్యుదయ

విభాతాకాశము నొసట పొడుచు
అరుణారుణ తార. ॥ఆకాశము॥

మనిషిని పీడకలగా సాగయ జేయు సంకెళ్ళు తెగనివి కావని ఆయన స్వతంత్ర్యోద్యమం వైపుకు దారి చూపించారు. ఆశావాదియై ముందుకు అడుగు వేస్తూ...

''మహాకృతం మహాయుగం
ముందున్నది ముందున్నది
ముందున్నది ముందే, మరి
ముందే యువ మహాయుగం
కలికాలం ముసలి ముసిలి
చలికాలం మసలి మసిలి
కొండచిలువ లాగ పెద్ద
బండలాగ దొర్లిపోయె.''

మహా యుగంవైపు సాగుతున్నామనే మహోన్నతమైన భావన ఆనాటి యువతలో మ్రోగించిన శంఖారావంగా మారుమ్రోగింది. ఇంకా....

''కునుకు జరఠ కలికాలం
వెనుక నడక కుళీరం
పీతలాంటి భూతం మన
తాతలదీ తండ్రులదీ
రోత రోత రోత మనది
ప్రాత రుజ్వలాకాశం
భావి మందిరాకాశం
ప్రాతరున్న తావాసం॥'' అన్నారు కృష్ణశాస్త్రి.

ఈ గేయం తరువాత తరం అభ్యుదయ కవులకు మార్గదర్శకమైనదని చెప్పవచ్చు.

(1945 సెప్టెంబరు ప్రతిభలో ముద్రితం)

కృష్ణశాస్త్రి అభ్యుదయ కవుల హృదయాల్లో చెలరేగిన ఉద్వేగ భావాలు గుర్తించారు. ఆశీర్వదించి వారికి పథనిర్దేశం చేసి ముందుకు సాగనంపారు.

తృతీయ అభ్యుదయ రచయితల మహాసభకు అధ్యక్షత వహించడం ఆయన అభ్యుదయ ప్రియత్వానికి నిదర్శనం. ఆనాటి వారి హితోపదేశం 1946 మార్చి 'తెలుగుతల్లి' పత్రికలో అచ్చయింది. అందులో వారంటారు :

> ''పీడించబడే వాళ్లు పీడించే వాళ్లు వున్న ఈ వ్యవస్థ ఉండాలని ఎవరూ కోరరు. రానున్న విధానంలో సాధారణ మానవుడే మకుటధారి. పురోగమిస్తున్న లోకాన్ని ప్రతిఘటిస్తున్నవారు ఎప్పటికీ అభ్యుదయవాదులు కాజాలరు.
>
> ఈ ధనిక స్వరాజ్యం పోవాలనడమే అభ్యుదయం. ఇది మనస్సులో పెట్టుకొని వ్రాసేదే అభ్యుదయ రచన'' అని.

కనుక కృష్ణశాస్త్రిగారు భావ కవితా ప్రతినిధే కాదు. అభ్యుదయ కవితా వైతాళికుడు కూడా.

# 10. కాలాన్ని కదిలించిన కవి కృష్ణశాస్త్రి

ఈ శతాబ్దం తొలి రోజుల్లో దాదాపు మూడునాలుగు దశాబ్దాల కాలం తెలుగు కవిత్వానికి ప్రజాదరణ విపరీతంగా వుండేది. కవిత్వం పట్ల ప్రజల్లో ఎంతో మోజు ఉండేది. కవిత్వం అంటే చెవి కోసుకోవడం గొప్ప నాగరిక మర్యాదగా భావించేవారు. కవులను దేవతలను చూచినట్లుగా చూచేవారు. ఆనాడు ప్రజల్లో అంత గొప్ప కవితాభిమానం కలగడానికి కారణంగా భాసిల్లినవారు కృష్ణశాస్త్రి.

ఆయన పద్యం చదివితే ప్రభాతంగా ఉండేది. పాట పాడితే జలపాతంలా ఉండేది. ఆయన పదాల కట్టు ఆనాటి కవులకు ఆటపట్టు. ఆయన పంచకట్టు, గిరజాల జుట్టు ఆనాటి యువతకు పట్టుబడిన మెట్టు. ఆయన భావకవిగా పుట్టారు. భావకవిగానే కలం పట్టారు.

భావకవితని ఉద్యమంగా చేపట్టారు. దానికి ఒక నిర్దిష్ట రూపురేఖలు కల్పించారు. కృతకమైన అలంకార వైభవంతో శబ్దప్రాభవంతో, శరీరమంతా అరువు బరువు భారంతో వంగిపోయిన ఆంధ్రసాహితీ సరస్వతికి రసదీప్తి కలిగించి, సహజ సౌందర్యం పాదివి, సహృదయ హృదయైక వేద్యంగా రూపురేఖలు మార్చి పునర్జన్మ నిచ్చిన కవి కృష్ణశాస్త్రి.

సమకాలీన సామాజిక వేదన కవిత్వంలో అంతకు ముందెప్పుడూ కనిపించదు. గతం నుంచి ముందుకు వేసిన అడుగు కృష్ణశాస్త్రి. ఆయన పాడితే పక్షులు వంత పాడతాయి. మబ్బులు శ్రుతి కలుపుతాయి. నదులు, పర్వతాలు లయలు చూపుతాయి. అందుకే ఆయన అచ్చమైన ప్రకృతి కవి.

ఆయన పాటల్లో ఆకుల నాడించే కొత్తగాలి. ఆయన మాటల్లో విశ్వప్రేమను చూపించే కొత్త ఊపు. ఆయన ఆలోచనలో సామాజిక హృదయ స్పందనలపై కొత్త చూపు. ఆయన కలంలో కరుణ జాలు వార్చెడి క్రొత్త రసస్పందన. ఆయన కవితలో సర్వ హృదయాలు కదిలి కదిలిపోయే నూతన భాష్పీభవన పరిస్పందన. అందుకే ఆయన యుగకవి. భావ కవితా నవయుగ వైతాళికుడు.

కృష్ణశాస్త్రి మానవోద్యమాన్ని ప్రభవించిన బ్రహ్మసమాజ ప్రభావం నుంచి తలెత్తారు. ప్రపంచంలో కవిగా తనకు దొరికిన సౌందర్య శకలాలన్నీ ఒకచోట చేర్చి ఊర్వశిని సృష్టించుకున్నారు. అస్పష్టమైన ఒక ఉద్విగ్న హృదయ సంచలనాన్ని మాటల్లో పొదివి చెప్పడానికి చేసిన అమోఘ ప్రయత్నంలో, కృష్ణశాస్త్రి పద సమాసాల స్థానంలో భావసమాసాలు సృష్టించారు. కవిత్వాన్ని ధ్యానస్థితికి చేర్చారు. కవిత్వానికి రంగు, రుచి, వాసన సమకూర్చారు.

భావ కవిత్వాన్ని ఉద్యమంగా స్వీకరించి ఊరూరా తిరిగి ఊపిరి పోశారు. నిలబెట్టారు, సింహాసనం ఎక్కించి పట్టాభిషేకం చేశారు. భావకవితాయుగాన్ని రూపు చేసి తానే ఆ యుగవైతాళికుడైనాడు.

శాస్త్రిగారి చైతన్యవాక్కుల నుంచి, జీవం కురిపించే చూపుల నుంచి, ఆయన ప్రభావం నుంచి తప్పుకోవడం సాహితీ పిపాస ఉన్నవాళ్లకు సాధ్యమయ్యేది కాదు. ఆయన కవిత ఆత్మీయుడైన మిత్రుడు సంస్కారాన్ని తట్టి మేలుకొల్పినట్లుంటుంది.

సంప్రదాయం నుంచి చైతన్యవంతమైన శబ్దాలను ఏరుకోగలరు. సమాజం నుంచి ప్రేమపూరితమైన సన్నివేశాలు తెలుసుకోగలరు. అవి రెండూ కలిపి కవిత్వంగా ఆవిష్కరించగలరు.

ఆ కవిత్వాన్ని పాడి ఎదుటివాడి గుండెలో గూడు కట్టి కాపురం చేయగలరు.

''అందుకే కవి కృష్ణ శాస్త్రి
కమ్మని కవితలకతడు మేస్త్రి''

# అనుబంధము - 1

## కృష్ణశాస్త్రి విశిష్ట పద్య రచన - అన్వేషణ

''తలిరాకు జొంపముల సం
దులఁత్రోవల నేల వాలు తుహినకిరణ కో
మల రేఖవో ! పువుదీవవొ !
వెలదీ, యెవ్వతెవు నీపవిటపీవనిలోన్ ?

కారుమొయిళ్ళ కాటుకపొగల్
వెలిఁగక్కు తమాలవాటి నే
దారియు కానరాదు, నెలతా !
యెటువోయెద వర్ధరాత్రి - వి
స్ఫార విలోచ నాంధ తమసమ్ముల
జిమ్ముచు, వేడి వేడి ని
ట్టూరుపులన్ నిశీథ పవ నోర్మి
వితానము మేలుకొల్పుచున్ ?''

'' అది శరద్రాత్రి; శీత చంద్రాత పాంత
రాళ రమణీయ రజత తల్పంబునందు
చల్లగా నిద్రవోవు వ్రేపల్లెవాడ
సకల గోపాల గోపికా జనముతోడ.

సాము సడలిన పతి పరిష్వంగమందు
సుఖము దుఃఖము లేని సుషుప్తిలోన
స్వప్నవీథీ యథేష్ట సంచార కలన
మేను మరచిన నన్నంత మేలుకొలిపె

శర్వరీ శీత పవన పక్షముల మలసి
స్వాదు యము నోర్మి సంగీత ఝరుల గలసి
కౌముదీధౌత శుభ్ర దిక్తటుల సొలసి
మురళికా మందమంద మాధురుల రుచులు.

ఎలదేటి చిరుపాట సెలయేటి కెరటాల
బడిపోవు విరికన్నె వలపువోలె
తీయని మల్లెపూతేనె సోనల పైని
తూగాడు తలిరాకు దోనెవోలె
తొలిప్రొద్దు తెమ్మెర త్రోవలో పయనమై
పరువెత్తు కోయిల పాటవోలె
వెల్లువలై పారు వెలది వెన్నెలలోన
మునిగి పోయిన మబ్బుతునుకవోలె

చిరుత తొలకరివానగా చిన్ని సొనగ
పొంగి పొరలెడు కాల్వగా నింగి కెగయు
కడలిగా పిల్లగ్రోవిని వెడలు వింత
తీయదనముల లీనమైపోయె నెడద.

పరువు పరువున పోవు నెదతో
పరువు లెత్తితి మరచి మేనే
మరచి సర్వము నన్ను నేనే
మరచి నడిరేయిన్.''

''ప్రాణనాయకు కౌగిలి పట్టు వదలి
యిల్లు వదలి యెన్నండు నీ పల్లె వదలి
యడుగిడని దాన, వా నాటి యర్ధరాత్రి
విజన పథముల బడి యెట్లు వెడలినావు ?''

''తావులతోడ తేనియల
ధారల చిప్పిలు వేణు గీతికా
రావముతోడ మందగతులన్
జనుమారుతముల్ విశాల బృం
దావన వీధులందు యమునా
నవభంగ మృదంగ వాద్యముల్
త్రోవ స్ఫురింపగా వలపు
తొందర వెట్టగ బోతె నొంటిమై.

సన్నని యెల్గెత్తి జాలిగా నెవరినో
యరయుమా ! పిలుచుచున్నదియె యమున !
ప్రక్క నిర్జీవ ధావళ్యమ్ముతో నున్న
సికతాతలమ్ము గాంచితివె, దాని ?
తుది మొదల్ లే దిదే త్రోవరుల్ త్రొక్కని
యీ దారినే పరువెత్తినాను !
ఈ మొండిచేతుల నెత్తి యీ వనతరుల్
శూన్యదృక్కుల దిశల్ చూచు నయ్యొ !

ఇచటనె, యిచటనే యత; డిచట నేను -
ఇచటనే నీ జాజిపూ పొదరింట నేను -
ఈ కడిమి చెట్టు క్రింద సుమ్మీ యతండు -
సరిగ కన్నుల గట్టిన సరణి దోచు.

శారద శర్వరీ మధుర చంద్రిక,
సూర్యసుతా స్రవంతికా
చారు వినీల వీచిక, ప్రశాంత

నిశా పవనోర్మి మాలికా
చారిత నీప శాఖిక, కృశాంగిని
గోపిక నేను, నాడు బృం
దా రమణీయసీమ వినినారము
మోహన వేణుగానమున్.

మలయ పవను కౌగిలిలోనె పులకరించి
హాయిగా కంఠ మెత్తు ప్రాయంపు వంశి
విశ్వమోహను జిలిబిలి పెదవు లంటి
యవశమ్మై పోయి యేమి చేయంగ లేదు !

బాలగోపాలు బోలెడు పాటగాని
కని విని యెరుంగ మెన్నండు; కరములోని
మురళినే కాదు, నాలోని మ్రోడు టెడద,
నీశిథిల జీవనమ్ము మ్రోయింప గలడు.

నందగోప కుమారు నానంద మురళి
కా మనోహర సుషి రాషగా తరంగ
జాలముల తారకా రవి చంద్రతతులు
కరిగి చిని చిన్ని గీతులై కలిసిపోవు.

చూచితిరొ లేదొ చిన్ని కృష్ణుని సొబంగు ?
పెదవి చివురు సంజల నరవిచ్చు నవ్వు
వెన్నెల, చలించు తుమ్మెద బెళుకు చూపు,
లోల పవన చాలిత కుటి లాలకమ్ము,
తరళ చాడా కలాపమ్ము, మురళి గూడి
యల్ల నల్లన గొంతెత్తి యమృతగాన
శీతల తుషారముల విరజిమ్ము వేళ
చిన్ని కృష్ణుని సొబగు చూచితివొ లేదొ ?

లేవు శరత్తమస్విను లు
లేవు మనోజ్ఞ సుధాంశు మాలికల్
లేవు వినీల నిర్మల కళిందసుతా
నవనాట్య సంపదల్
లేవు మదీయ గాత్ర లవలిం
బుల కాంకుర కోర కావళుల్
లేవు కుమారగోప మురళీ
మృదుగీత ఝరీ విలాసముల్ !

జిలిబిలి పట్టురేకుల వెన్క తొట్రిలు
మల్లియ యెద దాగు మధుప రవము
కనుచూపు దాటు నామని బాయు కోయిల
గొంతులో చిక్కు వసంతగీతి
విభువీడి శుష్కించు విరహిణి సెలయేటి
కడుపులో నడగిన కడలి మ్రోత
రేనికై వెదకెడు రిక్కచూపుల లోన
చెరవడ్డ నిండుచందిరుని పాట

యిట్టి లీ దీన గోపికా హృదయ మంది
రాంతరాళము లోన త్రుళ్ళింత లాడు
వేణు నాదంబు, వినిపించు విశ్వమోహ
నాకృతి కిశోర గాయకు నరయుచుంటి.

ఇది నాచరితము, విని నీ
వదరెదు తొట్రిలెదు వడకు దటు నిటు కనులన్
జెదరెడు చూపుల నేదో
వెదకెదు ! ఎవ్వతెవు నీపవిటపీవనిలోన్ ?''

# అనుబంధం - 2

## కృష్ణశాస్త్రి పూర్వ కవి స్తుతి 'మహాకవి'
## (గురజాడ అప్పారావు)

''గుత్తునా యని జాతి ముత్యాల్
గుచ్చినాడే మేలి సరముల
ఇత్తునా యని తెలుగుతల్లికి
ఇచ్చినాడే భక్తితో !

నవ వసంతము నవ్య వనరమ
మావి కొమ్మల కమ్మ చివురులు
పాట పాడెడి పరభృతంబును
ఎవ్వ రాపుదురో ?

పొడుపుమల పయి రంగవల్లిక
మింటి నడుమ ప్రచండ తేజము
సంజమబ్బుల పైని కెంపులు
చూడరైతిరి గా !

రంగవల్లిక మాయ మయ్యెను
చండతేజము మాసిపోయెను

దేవులపల్లి కృష్ణశాస్త్రి

సందెకెంపులు సాగిపోయెను
వెదకుచున్నారా !
కారుచీకటి క్రమ్మినప్పుడె
చదల మబ్బులు కప్పినప్పుడె
మిణుగు రైనను మెరయనప్పుడె
వెదకుచున్నారా !

చుక్కలన్నియు సాక్షి సోలెను
గిరులు కదలెను, తిరుగ పాడెను
లోకమోహన మధురగానా
స్వాదమోదమున.

యుగయుగంబులనుండి మ్రోగెడు
విశ్వగాన వియత్తరంగిణి
భంగముల నుప్పొంగు నాతని
గీతశీకరముల్

పాట పాడిన పరభృతంబును
మూగవోయిన ముద్దుకోయిల
చిన్నిపికములు చిరుతపాటల
పిలుచుచున్నవియా !''

# అనుబంధం – 3

## ''కృష్ణశాస్త్రి గారి జయ గీతి''

జయ జయ జయ ప్రియ భారత
జనయిత్రీ దివ్యధాత్రి !

జయ జయ జయ శత సహస్ర
నరనారీ హృదయనేత్రి !

జయ జయ జయ సశ్యామల సుశ్యామచలచ్చేలాంచల !
జయ వసంత కుసుమ లతా చరిత లలిత చూర్ణకుంతల !
జయ మదీయ హృదయాశయ లాక్షారుణపదయుగళా !
జయ జయ జయ ప్రియ భారత
జనయిత్రీ దివ్యధాత్రి !

జయ జయ జయ శత సహస్ర
నరనారీ హృదయ నేత్రి !

జయ దిశాంతగత శకుంత దివ్యగాన పరితోషణ !
జయ గాయక వైతాళిక గళ విశాల పథవిహరణ !
జయ మదీయ మధురగేయ చుంబిత సుందర చరణా !

జయ జయ జయ ప్రియ భారత
జనయిత్రీ దివ్యధాత్రి !

# అనుబంధం - 4

## మేఘమాల

ఆమె : ఆకాశ వీధిలో హాయిగా ఎగిరేవు
దేశ దేశాలన్నీ తిరిగి చూ సేవు
ఏడతానున్నాడో బావ
జాడ తెలిసిన పోయిరావ
అందాల ఓ మేఘమాల
అందాల ఓ మేఘమాల

అతడు :గగన సీమల తేలు ఓ మేఘమాల
మా ఊరు గుడిపైన మసలి వస్తున్నావ
మల్లి మాటేదైన నాతో
మనసు చల్లగ చెప్పిపోవ
నీలాల ఓ మేఘమాల
రాగాల ఓ మేఘమాల

ఆమె : మమతలెరిగిన మేఘమాల నా
మనసు బావకు చెప్పిరావ

ఎన్నాళ్లు నా కళ్ళు
దిగులుతో రేబవలు
ఎదురు తెన్నులు చూచెనే బావకై
చెదరి కాయలు కాచెనే
నీలాల ఓ మేఘమాల
రాగాల ఓ మేఘమాల

**అతడు :** మనసు తెలిసిన మేఘమాల
మరువలేనని చెప్పలేవా మల్లితో
మరువలేనని చెప్పలేవా
కళ్ళు తెరచిన గాని
కళ్ళు మూసిన గాని
మల్లి రూపే నిలచెనే నాచెంత
మల్లి మాటే పిలిచెనే ॥

**ఆమె :** జాలిగుండెల మేఘమాల
బావలేనిది బ్రతుకజాల
కురియనా కన్నీరు
గుండెలో దాచుకొని
వానజల్లుగ కురిసిపోవా కన్నీరు
ఆనవాలుగ బావ మ్రోల ॥

# అనుబంధం - 5

## పూర్వ కవులను గురించి కృష్ణశాస్త్రి గారు చెప్పిన అభిప్రాయాలు

'నన్నయ తిక్కనలు ప్రయోగించినంత గొప్పగా శబ్దాన్ని ఏ తెలుగు కవి ప్రయోగించలేదు. వీరి తరువాత రామకృష్ణ కవి వస్తాడేమో'

(వ్యాసం) 'నన్నయభట్టారకుని అమరవాణి' రేడియో ప్రసంగం.

'నన్నయ భట్టారకుడు మహారాజు గురువు. పెద్దన సార్వభౌముని ప్రాణ స్నేహితుడు. తరువాతి కవులు ప్రభువుగారి ఆశ్రితులో సేవకులో !'

(వ్యాసం) పెద్దన (రేడియో ప్రసంగం)

'శ్రీనాథుడు కవుల కవి, అతని తరువాత కవులలో దిగ్గజాలనిపించుకొన్న వారికి కూడా శ్రీనాథుని కవితారీతులంటే అనురక్తి'

(వ్యాసం) 'శ్రీనాథుని కవిత' రేడియో ప్రసంగం 7-11-54

'వేమన మాట రెక్క ముడవని భరతపక్షి. కాలాలు దాటి ఇంకా ఎగిరి వస్తూనే ఉంది. వేమన చదువుకున్నట్టే కనబడడు. చదువుల్లో మర్మం మాత్రం ఇతనికి తెలుసు'

(వ్యాసం) వేమన (రేడియో ప్రసంగం)

'వారు (తిరుపతి వేంకటకవులు) గొప్ప కవులు, అయితే పద్య కవిత్వం కన్నా కూడా వారి వచనం గొప్పదని నా నమ్మకం.'

(వ్యాసం) తిరుపతి వేంకటకవులు, ఆంధ్ర పత్రిక (10-4-60)

'వంగ భాషకు రవీంద్రుని గీతాంజలి ఎట్టిదో, మన యాంధ్రమునకీ మహాకవుల, భక్తుల యేకాంత సేవ యట్టిదని యభిప్రాయము అసలు మనకు వేంకట పార్వతీశ్వర యుగమని ఒకటి వున్నది.'

(వ్యాసం) వేంకట పార్వతీశ్వర కవులు కావ్య కుసుమావళి

'ఎంతకూ చల్లారని కోరికలాగ కనబడతాడు నాకెప్పుడూ (బసవరాజు) అప్పారావు. ఊరికే నిట్టూరుస్తూ ఉండే గుండె లాగ'

(వ్యాసం : బసవరాజు అప్పారావు బసవరాజు అప్పారావు గీతాలు 1955)

'ఆరోజుల్లో నండూరి గొంతు కొండ వాగు గలగలలూ గంతులూ, సుడులూ వడులూ ! ఒకచోట పుట్టి, ఒక దారిని సాగి ప్రవహించి, ఒక చోట కలిసిపోయేది సుబ్బారావు పాట నిభృత సుందరం, అప్పారావు పాట నిసర్గ మనోహరం !

(వ్యాసం) బసవరాజు అప్పారావు
''బసవరాజు అప్పారావు గీతాలు'' (1955)

''విశ్వేశ్వరరావు నిజంగా కవి అసలు ఇతనికి కవిత్వం రాయడం తప్ప ఇంకేమీ రాదని నా నమ్మకం. నాకూ అంతే !....''

(వ్యాసం) మల్లవరపు విశ్వేశ్వరరావు 'మధుకీల'
పురూరువ పరిచయ వాక్యాల్లో (1937)

''బర్న్స్ స్కాట్లాండ్ జాతీయ కవి మాత్రమే కాదు. అతని ఊహలు, అతని అనురాగాలూ విశ్వజనీన మానవులకు చెందినవి. అతని హృదయం లోకమంత విశాలమైనది. అతని ఆవేశమూ, ఉత్సాహమూ,

నిర్లిప్తతా, అన్యాయమంటే ఆగ్రహమూ, అవధులెరుగని కరుణా, అర్జవావేశమూ, లక్ష్యశుద్ధీ - ఇవన్నీ అతన్ని విశ్వమానవ కవిని చేశాయి.''

(వ్యాసం) కవితా మాధురి
రేడియో ప్రసంగం (1959)

''పో, అలౌకికమైనవి, భయంకరమైనవి, దిగులు కలిగించేవి, అస్పష్టంగా ఉండేవి అయిన వస్తువులు తీసుకొని, వింతగా మోగే శబ్దాలూ, అనుప్రాయలూ తీసికొని, మనం ఎన్నడూ అనుభవించని మనస్థితిలో మనలని పారేస్తాడు.''

(వ్యాసం) ఎడ్గార్ ఎలెన్ పో
రేడియో ప్రసంగం (1959)

# అనుబంధం - 6

## మహావ్యక్తులను గురించి కృష్ణశాస్త్రి అభిప్రాయాలు

కందుకూరి వీరేశలింగం పంతులు గురించి :

ఈ మానవ మహాసాగర మధ్యాన నవయుగారంభ వేళ నిలబడిన నవ మానవుడు, యూనివర్సల్ మాన్ తెలుగు నాట వీరేశలింగం.

1971 జులై - ఆంధ్రప్రదేశ్ - వీరేశలింగం
జన్మదిన సంస్మరణ సంచిక నుంచి.

చిలకమర్తి లక్ష్మీ నరసింహం పంతులు గురించి :

చిలకమర్తి లక్ష్మీ నరసింహంగారు రాజకీయాలలో సైతం జంక లేదు. కాలవాహినితో పాటు ఏర్పడుతున్న ప్రతి ఉద్యమంలోను వీరు పాల్గొని సానుభూతి చూపారు. సాహిత్యానికి, సమాజానికి గల సన్నిహిత సంబంధాన్ని గ్రహించి, తమ సాహిత్యాన్ని సృష్టించారు.

''తెలుగు తల్లి'' 1945 ఏప్రిల్

రఘుపతి వెంకటరత్నం నాయుడు గురించి :

నాయుడుగారి హృదయము శత తంత్రీ మహతి. ప్రతివాయువు

నిహతికిని కంపించి పోయెడిది. ప్రతి శిష్యునితోడి యనుభవములేకాక ప్రతి కావ్యములోని యనుభవములును నందనానిలములై వారి మనస్సునుఱ్ఱూతలూగించెడివి.

He is a tube through which all things blow into music

కాకినాడ పి. ఆర్. కాలేజి మ్యాగజైన్ (1939-40)

రవీంద్రుని గురించి :

రవీంద్రుని కావ్యాలూ, సందేశాలూ చదివితే వాల్మీకి నుంచి కాళిదాసుదాక, కాళిదాసు నుంచి కబీరుదాసు దాక, కబీరు నుండి ఈ రోజుదాక, ఒక్కొక్కరితోనే చెయ్యీ చెయ్యీ కలిపి పాడుతూ అలాగే వస్తూ ఉన్నట్టుంది.

అలాగే ఈ దేశం నుంచి ఆ దేశానికి, ఆఖండం నుంచి ఈ ఖండానికి ఆరిపోని తన కరదీపికతో విజ్ఞాన స్నేహాలు పోస్తూ, మూల మూలలూ వెలిగిస్తూ తిరుగుతూ ఉన్నట్లుంటుంది.

రేడియో ప్రసంగం.

దేశబంధు గురించి :

దేశభక్తుడైన చిత్తరంజన్ దాసును లోకం క్రమ క్రమంగా మరచి పోవచ్చునేమో కాని - చిత్తరంజన్ కవిని మరచిపోలేదు.

రేడియో ప్రసంగం. 5-11-1959

టంగుటూరి ప్రకాశం గురించి :

ఇది ప్రజా ప్రభుత్వం అయితే, ప్రకాశం లాంటి ప్రధాని మరొకడు దొరకడు. ఈ దృష్టితో చూస్తే భారతదేశములో ఏ రాష్ట్రానికీ ఇంత అర్హుడైన ప్రధాని లేడు.

శిల్పి - 1946.

# అనుబంధం - 7

## కృష్ణశాస్త్రిగారి గురించి పెద్దల అభిప్రాయాలు

''కృష్ణశాస్త్రి తన బాధను అందరిలోను పలికిస్తే.....''

''కృష్ణశాస్త్రి బాధ ప్రపంచానికి బాధ''

- చలం

''ఎవ్వరేమన్నా భావకవిత్వమనే దానికి రూపమిచ్చి పెంపొందించినవాడు కృష్ణశాస్త్రే. తక్కినవాళ్ళు ఒక అడుగు అక్కడా ఒక అడుగు ఇక్కడా వేశారు. కృష్ణశాస్త్రి అచ్చంగా భావకవిత్వమే వ్రాస్తాడు. అదీ అతని వైశిష్ట్యం.''

- విశ్వనాథ సత్యనారాయణ

ఇక్షు సముద్రం ఎక్కడుందో నాకు తెలియదు. కాని, ఆ పాత మధురమయిన కృష్ణశాస్త్రి సాహిత్యం సమస్తమూ ఇక్షురసార్ణవమే. కృష్ణశాస్త్రి పలుకుల్లోని చెరకు తీపి సాహిత్య రస పిపాసువులకు ఎక్కడో ఉందనుకొనే ఇక్షు సముద్రాన్ని వెతుక్కోవలసిన అగత్యాన్ని తొలగిస్తుంది.

అందుకే పురాణాల్లో పేర్కొన్న ఇక్షు సముద్రం ఎక్కడుంటుందో దాని

జాగ్రఫీ జోలికి వెళ్ళదలచుకోను నేను. మన యెదుట నిజంగా కృష్ణశాస్త్రి సాహిత్య సమస్తమూ ఉరకలు పరుగులుగా ఉప్పొంగుతోంది. ఇదే అసలు సిసలైన చెఱకు రసాల కడలి. ఆస్వాదించుదాం రండర్రా అని అందర్నీ ఆహ్వానిస్తున్నాను.

- శ్రీ శ్రీ

సమస్తమును ఈశ్వరార్పణము చేయునపుడే అవ్యయానంద మావిర్భవించును. ఇది సమగ్రముగా సంభవించినపుడు కృష్ణకవి హృదయంలోని కృష్ణ పక్షము శుక్లపక్షముగా పరిణమించి లోకముపై నూతన చంద్రికలను ప్రసరింప గలదు.

- తల్లావఝ్జల శివశంకరశాస్త్రి

కృష్ణశాస్త్రిగారు తన తెలుగును చెక్కుతారు. దానికి నగిషీ పడతారు. మెరుగు పెడతారు. పద్యంలోనూ, గద్యంలోనూ కూడా ఆయన అభిరుచి మహోసున్నితమైనది. ఆయన మనస్సులో ఎక్కడో అసలైన తెలుగు భాషకు నమూనా ఏదో వుంది. ఆయన రచనలన్నీ దానికి దగ్గరగా వుండాలి. నన్నయ నాటినుంచి నేటివరకూ గల తెలుగు సాహిత్యానికి రంగూ రుచి కల్పించి తెలుగు నుండికారమే కాక, నిత్యం తెలుగు ఇళ్ళలో వినబడే ప్రాణమున్న తెలుగులో మెలుకువలూ అందచందాలూ అన్నీ కలిపి, ఆయన పలుకులో నిగ్గుదేరి పద్యంగానో పాటగానో వచనంగానో రూపుదాలుస్తాయి.

- పాలగుమ్మి పద్మరాజు

'కరుణ కలదు ప్రేమ కల దీపికలదాత్మ
కలదు కృష్ణశాస్త్రి కవితయందు
టన్ను బరువు దానికున్న దాయని వాస
లెత్తి యడుగు, వానికేటి కోళ్ళు

- తుమ్మల సీతారామమూర్తి

కృష్ణశాస్త్రిగారు ప్రాచీన నవీన ప్రగతి పథాల త్రివేణీ సంగమం. ఇందులో ఏ ఒక్కటి నిర్గుణమైనదిగాని, నిర్దుష్టమైనదిగాని కాదని ఆయన తలంపు. ప్రతిభావంతుడు అన్నింటినీ చూస్తాడు. తన మార్గమేదో తాను నిశ్చయించుకుంటాడు. ఒకరి వెంటపడడం, ఒకరికి ప్రతిధ్వనిగా మారడం అతనికి గిట్టని సంగతి.

- ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

ఆయనకు పూర్వం ఎందరో గేయకర్తలున్నారు. ఆయనకు సమకాలికులూ ఆయన తరువాతి వారు వున్నారు. కాని ఆయనంతగా ఆలోచించి పరిశీలించి పరిశోధించి పాటకూర్చే రహస్యం, పాటకూర్పులోని అందాలను తెలుసుకున్నవారు చాలా తక్కువ.

- బాలాంత్రపు రజనీకాంతరావు

మల్లెపూల మీద పరుంటాడు
మంచి గంధం రాసుకుంటాడు
మరి ఎందుకేడుస్తాడు ?
మంచి పనివాడు, మాకు నచ్చినవాడు
మంత్ర నగరానికి వెళ్ళొచ్చినవాడు

- దేవరకొండ బాలగంగాధర తిలక్

కొంత మందిది నవత
కొంత మందిది యువత
కృష్ణశాస్త్రిది కవిత
ఒకూనలమ్మ !

- ఆరుద్ర

ఆయనలో క్షీర సాగరం వుంది. క్షార సాగరాన్ని క్షీరసాగరం చేయగల శక్తి ఆయన లేఖనిలో ఉంది.

- దాశరథి

శిల్ప గాయకుడు - కవిత్వంలో కూడా - సన్నపోగారు చెక్కడంలో మహా నిపుణుడు. 'కీట్స్', 'షెల్లీ'ల పదాల కూర్పు ఆంగ్ల కవిత్వానికి ఎటువంటి శోభను కూర్చిందో తెనుగు కవిత్వ భాషకు ఈయన కృషి అటువంటిఈవి. ఊహాతీతమైన దేనికో అర్రులు చాచే ఆశాజీవి, ఆశయాలలో, అనుభవాలలో కొత్తదనమూ, విశేష ప్రత్యేకత ఉన్నవాడు. ప్రేమకై విరహం పొందాడు. విరహంలో వేగిపోయాడు. ఈ అనుభవాలను శాశ్వత శిల్పాలుగా నిర్మించాడు. దుఃఖించాడు. ప్రేయసి మరణానికి. కాని దుఃఖం మారింది అవ్యక్తవేదనగా. చివరకు దుఃఖాన్నే వరించ మొదలుపెట్టాడు. ప్రేమించాడు వ్యక్తులనేమో, కాని, ప్రేమ తెరచిన గవాక్షాలగుండా హృదయం పరుగువారింది. వింత మిణుగురులకు, తళుకు మెరుపులకు, వీడని ఒక వేదనతో, ఒక తేజస్సుకై పాటలలో ఈయనను దరిజేరగలవారు లేరు. బ్రహ్మమతం కల్పించిన స్వేచ్ఛ పక్ష బలాన్ని కూర్చినా, అంతకు ఎక్కువైన స్వేచ్ఛకే పక్షాలను కదిపాడు. వైష్ణవ గీతాలలోని హృదయ పక్వత మెదడునకు పట్టించుకున్నాడు. కళాసంపత్తి ఎక్కువ. కవిత్వం కోసం బ్రతుకుతాడు రుచిగలవాడు.

- ముద్దుకృష్ణ

''ఆయన పాటలు పాడే పాత్రలు గొప్ప కవులు కానక్కర లేదు. అయినా వాటిలో స్వచ్ఛమైన కవిత్వం ఉంది. ఈ సామర్థ్యాన్ని సాధించిన జీనియస్ కృష్ణశాస్త్రి. విశ్లేషించడం నాకు సాధ్యం కాలేదు.''

- కొడవటిగంటి కుటుంబరావు

కాళిదాసు భవభూతులు, యమున వేదాంత దేశికులు, తిక్కన పెద్దనల, కబీరు సూరదాసుల, షెల్లీ బైరనుల వరసలో నిలబడే కవి కృష్ణశాస్త్రి.

- తిరుమల రామచంద్ర

ఆయన సమకాలికులలో పలువురు తమ తరాన్ని దాటి ఎదగలేదు. కొందరు తమ వెనుకటి తరానికి తిరోగమించారు కూడా. ఆయన

ఒక్కడే కాలంతో ఎదిగిన కవి. ప్రేయసీ వియోగ కవిగా, మిస్టిక్ పొయట్‌గా ప్రారంభమైన కృష్ణశాస్త్రిగారి క్రమ పరిణతికి చిహ్నం ''శీతవేళ రానీయకు'' అన్న ఆయన గేయం.

- నండూరి రామమోహనరావు

ఆరోజుల్లో పాటనుగాని, పద్యాన్నిగాని ఆయన భావమే తన రెక్కలపై మోసుకు తీసుకువచ్చేది. శబ్దంతో కాకుండా భావంతో సమాసం కట్టడం తెలుగులో నేర్పిన కవి కృష్ణశాస్త్రి.....కృష్ణశాస్త్రి కవిత చదువుతూ ఉంటే మనస్సు మునివాకిట్లో పారిజాతపు చెట్లపూలు రాలుతున్న అనుభూతి కలుగుతుంది. ఈ అనుభూతి కవిత్వానికి మరోపేరు కృష్ణశాస్త్రి అని మనం పిలుచుకోవచ్చు.

- ఇంద్రగంటి శ్రీకాంతశర్మ

భాషనుఆధునీకరించడంలో శక్తివంతమైన వారసుడు ఆయన. అందుకే ఆయన తెలుగు కవితా చరిత్రలో మహోజ్వల ఘట్టాన్ని ఆవిష్కరించగలిగారు. చిరంతన దీప్తులు వెలయించ గలిగారు. ఇరవయ్యవ శతాబ్దపు తెలుగు కవిత్వానికి ఆయన అలంకరించిన కలితురాయి అదే !

- ఆవంత్స సోమసుందర్

ఒక కవికి ఒక మానసికావస్థ స్థాయిగా ఉండటం ఒక్క కాల్పనిక కవితా రంగంలోనే సాధ్యం. అయినా అది అందరికీ అసాధ్యం. కృష్ణశాస్త్రి దానిని సాధించడమే కాదు, దానికి ఒక నమూనాగా, ప్రమాణంగా, ఆదర్శంగా నిలిచాడు.

- జి.వి.సుబ్రహ్మణ్యం

**1897**లొ చంద్రపాలెంలో మోసులెత్తిన ఒక మంచి గంధపు తరువు శ్రీ కృష్ణశాస్త్రి గారు. మంచి భోగి, త్యాగీనూ. జన్మాంతర వాసన, వంశపారంపర్యంగా అబ్బిన సంస్కారం, తండ్రి పెద తండ్రుల కవితా

వైభవం, గురువుల అనుగ్రహం వల్లను, గురుదేవుల మహిమ వల్లను కలిగిన వికాసము, ఆయన జీవనాన్ని మానవతా మధురము రసబంధురము అయ్యేట్లు చేశాయి.

ఆయన సాహచర్యం వలన ఆధునిక కవితా ప్రపంచం చరితార్థమైంది.

- వేటూరి ఆనందమూర్తి

ఆయన మౌలిక కవి. ఆయన కలంనుంచి పద్యం వచ్చినా గద్యం వచ్చినా అది మధుర కవితే, మురళీరవమే !

- సంజీవదేవ్

కృష్ణశాస్త్రి భావకృతులు సౌకుమార్యమాధుర్యములకు చరమసీమలు.

- సి. నారాయణ రెడ్డి

''ఏ యెల మావి కొమ్మ నెలుగెత్తినదో యొక కోయిలమ్మ ఆ<br>
హో యనిపించె కూహు కుహు వాశ్వర మశ్రుత పూర్వమైన నా<br>
ప్యాయముగా పురాస్మృతి శుభాంతముగా రసరాగభోగ<br>
సంధాయకమ్మై రహించె కవితా లలితా కల మంత్రహూతియై''

- యస్వీ జోగారావు

తాను ముట్టని నిత్యనూతనతలేదు<br>
తన్నుతాకని నవనవోద్యమము లేదు<br>
తలపులో పల్కులో ఉదాత్తతకు గురుడు<br>
కేవల కవీశ్వరుండె మా కృష్ణశాస్త్రి

- రజనీ

# అనూబంధం - 8

## కృష్ణశాస్త్రిగారి రచనలు

**పద్యకృతులు :**

1. కృష్ణపక్షము
2. ప్రవాసము
3. ఊర్వశి
4. నిశ్రేణి
5. పల్లకి

**గద్య రచనలు :**

1. అప్పుడు పుట్టి ఉంటే
2. బహుకాల దర్శనం
3. పుష్పలావికాలు

**వ్యాసరచనలు :**

1. కవి పరంపర
2. కవితా ప్రశస్తి
3. మహోవ్యక్తులు
4. అమూల్యాభిప్రాయాలు

**గేయసంహితులు :**

1. అమృత వీణ
2. మంగళ కాహళి

**నాటక సంపుటులు :**

1. దనుర్దాసు
2. శర్మిష్ఠ

**ఇతరములు :**

1. కీర్తనలు
2. పిల్లల రాజ్యం
3. యక్షగానాలు
4. బదరిక
5. అరుణరథం
6. విద్యావతి
7. కొత్తకోవెల
8. గోరింట
9. తిరుప్పావు
10. మూగనయాక
11. ఋగ్వీథి
12. మేఘమాల మొదలగునవి.